# స్రవంతి

# సాహిత్య మాస పత్రిక

వెల రూ॥ 4.00 డిసెంబరు, 1995



దక్షిణ భారత హిందీ ప్రచార సభ-
ఆంధ్ర హైదరాబాదు.



ది. 2-11-95న హిందీ ప్రేమీ మండలి, హైదరాబాదు ఆధ్వర్యంలో జరిగిన హిందీ విజయ పత్ర వితరణోత్సవము సందర్భంగా ప్రసంగించుచున్న ఆంధ్రసభ కార్యదర్శి శ్రీమతి కె. విమలాబాయి, శ్రీ గోదా తిరుమలయ్య, శ్రీ వహాకుల నరసింహమూర్తి, శ్రీ హెచ్.ఐ.వటే, శ్రీ కటారు మల్లయ్య, శ్రీ ఎస్. సత్యనారాయణ, శ్రీ జి. ఉమామహేశ్వరరావు

టెలిగ్రామ్ : హింది సంఘ్

501

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

డిసెంబర్, 1995

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ అన్నదానం శంకరశాస్త్రి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

ఖైరతాబాదు, హైదరాబాద్ - 500 004.

సంవత్సర చందా రూ. 40-00

విడి ప్రతి రూ. 4-00

Recommended for use in all the Public Libraries and School Libraries by the Director of Public Libraries, Andhra State, Madras Vide Proceedings Sl. No. 30/55 dated 6th January 1955.

---

# ఈ సంచికలో.....

సంపాదకీయం

## స్వవిషయం

జయ సంవత్సరం చైత్ర శుద్ధ పాడ్యమి ఉగాదినాడు ప్రారంభమైన స్రవంతి ఆనాటి నుండి నేటి వరకూ నిరాఘాటంగా ఒక్క సంచికైనా ఆగకుండా నడుస్తున్నది. సాహిత్య పత్రికల చరిత్రలో ఇది ఎంతో సంతోషించదగిన విషయం. స్రవంతి రజత జయంతిని పూర్తి చేసుకొన్నది. స్వర్ణోత్సవం జరుపుకొనవలెనని ఉవ్విళ్లూరుతున్నది. కొద్ది కాలంలోనే స్వర్ణోత్సవం జరుపుకొనగలదని ఆశిస్తున్నాము. స్రవంతి ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొన్నది. ఆర్థికంగా గూడా చాలా నష్టాన్ని భరించింది. దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్రశాఖ ఆర్థికంగా ఈ పత్రికను ఆదుకొంటున్నది. అందువల్లనే ఈ పత్రిక ఇంతకాలం నడవగలిగిందని అనడంలో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు. తెలంగాణా రచయితల సంఘం స్రవంతిని ప్రారంభించడానికీ, రచనలందించి అది సర్వాంగ సుందరంగా రూపు దిద్దుకొనడానికీ ఎంతగానో తోడ్పడింది. ఆ సంఘానికి కృతజ్ఞత తెలియజేసుకొంటున్నాము. ఆంధ్ర దేశంలోని అనేక మంది రచయితలు తమ రచనల ద్వారా స్రవంతికి ఎనలేని బలాన్ని సమకూర్చారు. వారి కందరికీ మా నమోవాకాలు. ఈ మధ్య స్రవంతి సరైన సమయంలో ప్రచురణ కావడంలేదు. అందుకు హిందీ ప్రచార ప్రెస్ కారణం గావడం చింతించవలసిన విషయం. దాదాపు ముప్పయి సంవత్సరాలుగా ఆ ప్రెస్ పని జేస్తున్నది. అనేక గ్రంథాలు ఆ ప్రెస్‌లో అచ్చయి ప్రచురింపబడినవి. కాని

దురదృష్టం వలన ఆ ప్రెస్‌ను మూసి వేయవలసి వచ్చింది. యూనియన్ కార్యకలాపాలూ, ప్రెస్ కార్యకర్తల వ్యవహారం అందుకు కారణం గావడం చాలా విచారకరం. ప్రెస్ మూతబడడంతో తెలుగు సాహితికి ఎంతోకాలంగా చేత నైనంత సహకారమందిస్తున్న స్రవంతి ఆగిపోవడం సభవారికి చాలా మనస్తాపాన్ని కలిగించింది. అయినా స్రవంతిని నడప వలెనని సభ నిర్ణయించింది. వి.యస్.యస్. లేజర్ గ్రాఫిక్స్ ప్రెస్‌లో స్రవంతి అచ్చవుతున్నది. డిశంబరు ౨౫ సంచికను పాఠకులకు అందిస్తున్నాము. ఏమైనా స్రవంతి ఇంకా రెండు మూడు నెలలు వెనకబడినట్లే లెక్క. తొందరలో ఆ సంచికలను సైతం ప్రచురించే ప్రయత్నం చేస్తున్నాము. రాబోవు ఉగాది నాటికి పత్రిక సక్రమమైన మార్గంలోనికి రాగలదని మా విశ్వాసం. రచయితలూ, పాఠకులూ కలిగిన ఈ అసౌకర్యానికి మన్నించగలరనీ, తమ సంపూర్ణ సహకారాన్ని అందించగలరనీ ఆశిస్తున్నాము. సాహిత్య పత్రికలు నడిపించడం ఎంతో కష్ట సాధ్యంగా వున్న ఈ రోజులలో తెలుగు సాహితీపరుల అండదండలు మాకు తప్పక లభించగలవని విశ్వసిస్తున్నాము.

★ ★ ★

# తెలుగు, తెనుగు పదాలు - ఒక పరిశీలన

- డాక్టర్ వి.సిమ్మన్న

## A. తెలుగు పదం - ప్రాచీనత, వ్యాప్తి, చరిత్ర

తెలుగు, తెనుగు పదాలు రెండూ ఆంధ్ర శబ్దంవలె 'జాతి, దేశ, భాషాపరంగా నేడు వ్యవహారంలో వాడుతున్నారు. ఈ రెండు పదాలు అచ్చతెలుగు పదాలు.

I. త్రిలింగ శబ్దవిచారం

II. త్రికళింగ శబ్దవిచారం

III. తెళుగన్నడం శబ్దవిచారం

IV. . తెలుగు పదం - మరికొన్ని దేశీయ వ్యుత్పత్తులు

V. తెలుగు పదం - శాసనాల్లో ప్రయోగాలు

## I. త్రిలింగశబ్ద విచారం:

### అ. త్రిలింగ-తెలుగు:

సంస్కృత, 'త్రిలింగ' శబ్దం నుంచే 'తెలుగు' పదం పుట్టిందని కొందరు విమర్శకులు భావించారు. దేశంలో శైవమత ప్రాబల్యం ఎక్కువయ్యాకనే 'త్రిలింగ' శబ్దం నుంచి 'తెలుగు' శబ్దం ఉద్భవించి వుంటుందన్న ఊహ రూపుదిద్దుకోవడం జరిగింది.

### i. త్రిలింగ - విద్యానాథుడు -ప్రతాప రుద్రీయమ్:

'త్రిలింగ' మంటే మూడు లింగాలని అర్థం. శ్రీశైలం, కాళేశ్వరం, ద్రాక్షారామం అనే ఈ మూడు పుణ్యశైవ స్థలాలచే ఆవృతమైన ఈ దేశానికి త్రిలింగదేశమనే పేరు వచ్చిందని ప్రాచీన కాలం నుంచి ఒక అభిప్రాయం ప్రగాఢంగా మనదేశంలో వ్యవహారంలో వుంది. ఈ అభిప్రాయాన్ని చెప్పినవాడు 13వ శతాబ్దానికి చెందిన విద్యానాథుడు. క్రీ.శ. 1300-1330 ఆయన తన 'ప్రతాపరుద్రీయమ్' లో చెప్పివున్నారు.

విద్యానాథుడు ద్వితీయ ప్రతాపరుద్రరాజాస్థాన పండితుడుగా వుండేవాడు. ఆయన, త్రిలింగాల్ని పేర్కొనడమేగాక 'త్రిలింగపరమేశ్వర' అని ప్రతాపరుద్రుని సంబోధించాడు. ప్రతాపరుద్రీయమ్ గ్రంథాన్ని చెలమచెర్ల రంగాచార్యులుగారు తెలుగులో 'ప్రతాపరుద్రయశోభూషణము' అనే పేర 'అనువదించారు'.

### ii. త్రిలింగ - పిన్నకోట పెద్దన - కావ్యాలంకార చూడామణి:

15వ శాతాబ్దికి చెందిన విన్నకోట పెద్దన/కీ.శ. 1410 ప్రాంతం/తన 'కావ్యాలంకార చూడామణి' గ్రంథంలో -

'ధరశ్రీ పర్వత కాళే<br>
శ్వర దాక్షారామ సంజ్ఞవఱలు త్రిలింగా<br>
కరమగుటనంధ్రదేశం<br>
బరుదార, ద్రిలింగ దేశమన జను గృతులన్'.

/9-5/

'తత్త్రిలింగపదము తద్భవంబగుటచే<br>
దెలుగు దేశమనగ దేట పడియె<br>
వెనుక దెనుగు దేశమన నంద్రు కొందఱు<br>
బ్యాసపంచగతుల బరగుచుండు'

/9-6/

అని చెప్పాడు. విన్నకోట పెద్దన. 'తెలుగు' శబ్దవ్యుత్పత్తితోపాటు 'తెనుగు' శబ్దవ్యుత్పత్తిని గూర్చి కూడా చెప్పాడు. శ్రీశైలం, కాళేశ్వర, దాక్షారామం అనే పేర్లు గల త్రిలింగాలకు ఆకరం/ స్థానం/అయిన కారణంగా ఆంధ్రదేశానికి త్రిలింగ దేశమనేపేరు కలిగిందని చెప్పాడు. త్రిలింగపదమే తద్భవమై. తెలుగుదేశమంటూ స్థిరపడిందని తర్వాత తెనుగుదేశమని, దానినే అన్నారని విన్నకోట పెద్దన వివరించాడు.

రీడర్ డిప్యూటీ డైరక్టర్, ఫాకల్టీ ఆఫ్ తెలుగు, స్కూల్ ఆఫ్ కరెస్‌పాండెన్స్ కోర్సు, వాల్తేరు.

### iii. త్రిలింగ - కాకునూరి అప్పకవి - అప్పకవీయము:

ఆంధ్ర దేశాన్ని 'త్రిలింగ' దేశమని వ్యవహరిస్తారని కాకునూరి అప్పకవి క్రీ.శ. 1650 తన 'అప్పకవీయము' లో చెప్పాడు.

'శ్రీక్షితిధర కాళేశ
దాక్షారామంబులనగ ధనరారెడు నీ
త్రిక్షేత్రంబుల లింగము
లెక్కింప ద్రిలింగ సంజ్ఞ నెన్నిక కెక్కున్.
/అప్పకవీయం 1-99/
'తత్త్రిలింగనివాసమై తనరుకతన
నాంధ్రదేశంబు దా ద్రిలింగాఖ్యమయ్యె
దెలు గగుచు దద్భవము బొడమె
వెనుక గొందఱు దానినే తెనుగు నండ్రు'
/అప్పకవీయం 1-100/

పై విషయాలన్నీ నిశితంగా పరిశీలించాక 'తెలుగు' శబ్దం 'త్రిలింగ' శబ్దం నుంచి పుట్టిందని తేటతెల్లమవుతుంది.

## ఆ. తెలుగు - త్రిలింగ:

### i. తెలుగు - త్రిలింగ - కొమఱ్ఱాజు లక్ష్మణరావు - లక్ష్మణరాయ వ్యాసావళి:

'తెలుగు' శబ్దమే ప్రాచీనమని దానినుంచే సంస్కృత 'త్రిలింగ' శబ్దం సృష్టించడం జరిగిందని కొందరు విమర్శకులు అభిప్రాయపడ్డారు. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు తమ 'లక్ష్మణరాయ వ్యాసావళి/ప్రథమ సంపుటి పుటలు 122-126/ లో 'తెలుగు' శబ్దమే ప్రాచీనమని దానియొక్క సంస్కృతీకృతరూపమే 'త్రిలింగ' శబ్దమని చెప్పారు.

చేంబ్రోలును తామ్రపురీ, తామ్రనగర అనీ, ముడియుమూరును చూడుగ్రామమనీ, ఓరుగల్లును 'ఏకశిలానగరమనీ, గుంటూరు/గుంట+ ఊరు/ను గర్తపురి అనీ, పొన్నూరు/పోన్ + ఊరు/ను స్వర్ణపురి అనీ సంస్కృతీకరించినట్లే 'తెలుగు' పదం సంస్కృతీకరించడం జరిగి త్రిలింగ శబ్దంగా మార్పు చెందిందనేది విమర్శకుల అభిప్రాయం.

## ఇ. తెలుగు దేశాన్ని ఎప్పటి నుంచి త్రిలింగదేశంగా పిలుస్తున్నారు?

1. క్రీ.శ.2వ శతాబ్ది నుంచి త్రిలింగశబ్దం వ్యవహరించబడుతూ వున్నట్లుగా విదేశీ యాత్రికుల, రాయబారులలేఖనాల్నిబట్టి తెలుస్తుంది. గ్రీకు దేశస్తులైన పి. టోలమి (P. Tolemy) ప్లీని (Pliny) అనే వ్యక్తులు క్రీ.శ. 2వ శతాబ్దిలో మనదేశంలో వ్యాపార నిమిత్తం సందర్శించి తాము 'త్రిలింగ దేశాన్ని గూర్చి విన్నట్లుగా తెలిపారు. తెలుగు దేశాన్ని టోలమి, త్రిలింగమ్ (Trilingam) గానూ, ప్లీని మూడొగలింగమ్ (Moodogalingam) గానూ పేర్కొన్నారు. టోలమి, ప్లీనీ అనే వారిద్దరూ త్రిలింగం గంగానదీ స్థలమని తెలిపారు. గోదావరినే వీరిద్దరు గంగానదిగా భావించి వుంటారు. ఏది ఏమైనా టోలమి, ప్లీలు త్రిలింగమ్, మూడోగలింగమ్ పదాల్ని ప్రయోగించారనేది చారిత్రకసత్యం.

2. 'త్రిలింగ' పదం దేశవాచకంగా బ్రహ్మాండ, స్కాందపురాణాల్లో వున్నట్లు చిలుకూరి వీరభద్రరావుగారు 'ఆంధ్రుల చరిత్ర' ప్రథమ భాగంలో పేర్కొన్నారు.

'శ్రీశైల భీమకాళేశ మహేంద్రగిరి సంయుతం
ప్రాకారం తు మహత్ కృత్వా త్రీణి ద్వారాణిచాకరోత్
అవసత్తత్ర ఋషిభి: యతో గోదావరీతటే
తత్కాల ప్రభృతి క్షేత్రం త్రిలింగ మితి విశ్రుతం'
/బ్రహ్మాండ పురాణము/

3. ఆంధ్ర విష్ణువు త్రిలింగ దేశాన్ని స్థాపించినట్లుగా 'ఆంధ్ర కౌముది'లో వివరించబడింది.

'ఆంధ్రనాథో మహావిష్ణు శుంభదనుజావహ:
పురా స్వాయంభువ మనో: కాలే కలియుగే హరి:
కాకులేరాజవర్యస్య సుచంద్రస్యతనూభవ:
అభవత్సర్వ దేవైశ్చ వేష్టితో లోక పూజిత:
శ్రీశైల భీమ కాళేశ మహేంద్రగిరి సంయుతం
ప్రాకారంతు మహాన్ కృత్వా త్రీణిద్వారాణిచాకరోత్
త్రిలోచనో మహీశస్య త్రిశూలంచ కరే వహన్
త్రిలింగరూపన్య [illegible] వృతా:
ఆంధ్ర విష్ణు: [illegible]యుతోదనుజీవని శుంభునా

యద్వాత్రయోదశయుగాన్ హత్వా తంరాక్షసోత్తమం
అవస త్తత్రఋషిభిర్యుక్తో, గోదావరీ తటే

4. 'త్రిలింగ శబ్దానుశాసనం' అనే వ్యాకరణ గ్రంథంలో అధర్వణాచార్యులు త్రిలింగశబ్దాను శాసనాన్ని కూడా రచించినట్లుగా వుంది.

'లోకేప్రసిద్ధం జయతి సర్వలక్షణలక్షితం
శబ్దం త్రిలింగ శబ్దానాం ఆధర్వణకవే: కృతి:
కరోమిశబ్దం శబ్దానాం త్రిలింగానాం సలక్షణమ్
బార్హస్పత్యాని సూత్రాణి కాణ్యం వ్యాకరణం విదన్'

5. రాజశేఖరుడు 'విద్ధసాల భంజిక' అనే నాటకంలో 'జయతు జయత్సు త్రిలింగాధిపోదేవ:' అని ప్రయోగించాడు.

6. సింగనాయకుని అక్కలపూడి శాసనము /1318/లో త్రిలింగదేశాధిపతి: శ్రీమాన్ అని వుంది.

### ఈ. ప్లీని పండితుడు - మూడో గలింగమ్:

ప్లీని పండితుడు 'ఆంధ్ర' దేశాన్ని మూడో గలింగమని పేర్కొన్నాడు. మూడో గలింగ సమాసాన్ని మన విమర్శకులు రెండు రకాలుగా విభజించి రెండు అర్థాలు చెప్తున్నారు.

1. మూడవలింగం, 2. మూడోలింగం.

### 1. మూడవ లింగం:

మూడవ లింగం అనేది మొదటి అర్థం. ఏది మూడో లింగమో? ఆ లింగాన్నిబట్టి ఆంధ్రదేశానికి 'త్రిలింగ' పదం ఏవిధంగా వచ్చిందో కానరాదు.

### 2. మూడోలింగం:

మూడోలింగంను మూడో + కలింగంగా విడదీసి ఆంధ్రదేశం త్రికలింగాల్లో మూడో కలింగమని ఇంకో అర్థాన్ని ఈ మూడోగలింగంకు చెప్పారు. మూడో కలింగ మన్నప్పుడు మూడు కళింగాలున్నాయనీ అందులో ఆంధ్రదేశం మూడో గలింగమనీ ప్లీని పండితుని అభిప్రాయం.

## II. త్రికలింగశబ్దం విచారం:

త్రికలింగ అంటే మూడు కళింగాలని అర్థం. 1. మధుకళింగం, 2. ఉత్కళకళింగం, 3. కళింగం అనే మూడు కళింగాలకు 'త్రికలింగం' అనే పేరు వున్నట్లు శ్రీ ముఖం లింగేశ్వరాలయాది శాసనాల్నిబట్టి మనకు తెలుస్తుంది. ఈ శాసనాలు 12వ శతాబ్దికి చెందినవి.

### అ. త్రికళింగ - తెలుగు:

### i త్రికళింగ - తెలుగు - ఆచార్య చిలుకూరి నారాయణరావు - ఆంధ్రభాషాచరిత్ర:

'త్రికళింగ శబ్దం నుంచి తెలుగు పదం ఉద్భవించిం దనే వాదంతో డాక్టర్ చిలుకూరి నారాయణరావు గారు ఏకీభవించారు ఆంధ్రభాషా చరిత్రము, పుటలు 32, 33/ తెలుగు మాటలాడే వారున్న దేశం మొత్తానికి అంటే ఆంధ్రరాష్ట్రానికి 'త్రికళింగ' మనే పేరు ఎప్పుడూ ఎక్కడా లేదు. తెలుగుదేశంలోని కొంత భాగానికి మాత్రమే 'త్రికళింగ' మని పేరు వుండేది. కాబట్టి ఈ వాదం సరైనదికాదు.

### ii. త్రికళింగ - తెలుగు - ఆచార్య గంటిజోగి సోమయాజి - ఆంధ్రభాషావికాసము:

తెలుగు, త్రికళింగ శబ్దభవమనీ, ధ్వనిపరిణామం వల్ల కాలక్రమంలో త్రికలింగ > ఆలింగ > తెలింగ > తీలింగ > తెలుగుగా మారిందని ఆచార్య గంటిజోగి సోమయాజులు గారి అభిప్రాయం. /ఆంధ్రభాషా వికాసము పు. 21-22/ ఈ వాదానికి కూడా సహేతుకమైన ఆధారాలులేవు.

## III. తెళుగన్నడం శబ్ద విచారం:

### అ. తెళుగన్నడం - తెలుగు:

### i. తెళుగన్నడం - తెలుగు ఆచార్య చిలుకూరి నారాయణరావు - ఆంధ్రభాషా చరిత్రము:

'తెలుగు గన్నడం' అనే పదం నుంచి తెలుగు పదం పుట్టినట్లుగా 'ఆంధ్ర భాషాచరిత్రము'లో ఆచార్య చిలుకూరి నారాయణరావుగారు మరో అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు. ఇది కూడా కేవలం ఊహమాత్రమే.

కన్నడ భాష ఐదు విధాలుగా వుండని అందులో తెళుగన్నడంఒకటనీ, తెళుగన్నడం అంటే కన్నడులు తమ మూలస్థానాన్ని విడిచి దూరదేశాలకుపోయి తమ భాషను తేలికగా ఉచ్చరించటం వల్ల కలిగిన భాష అని ఒక కర్ణాటక లాక్షణికుడు పేర్కొన్నట్లుగా ఆచార్య చిలుకూరి నారాయణరావు గారు చెప్పారు. /ఆంధ్ర భాషాచరిత్రము. పుట 34/.

'తెళుగన్నడం' తెలుగు కావటం ధ్వని పరిణామ సూత్రాలకు విరుద్ధం. 'తెళుగన్నడం' అంటే 'తేట' కన్నడం. అనే అర్థం కాని 'తెలుగు' అనే అర్థం కాదు. తెలుగన్నడం అని తెలుగు భాషను ఎప్పుడూ ఎక్కడా పేర్కొనలేదు. ఆచార్య చిలుకూరి నారాయణరావుగారు పేర్కొన్న కర్ణాటక లాక్షణిక శిఖామణి ఎవరో చెప్పలేదు.

## ii. తెళుగన్నడం - తెలుగు: చిలుకూరి వీరభద్రరావు -రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక:

కరణభాష, కన్నడభాష అయినట్లే తెళుగన్నడభాషయే 'తెలుగు' అయిందని చిలుకూరి వీరభద్రరావుగారు/ రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక పుట 85/ లో అభిప్రాయపడ్డారు. ఈ ఊహకు సరైన ఆధారాలు లేవు.

## ఖండన: ఆచార్య గంటిజోగి సోమయాజి:

ఆచార్య గంటిజోగి సోమయాజి గారు / ఆంధ్రభాషావికాసము పుటలు 28, 29/ తెళుగన్నడం తెలుగుకు మూలమనే వాదాన్ని ఖండించారు. భాషాశాస్త్ర ధ్వనిమాత్రపద్ధతిని బట్టి పరిశీలించి చూచినా తెళుగన్నడం, తెలుగు కావడానికి అవకాశం లేదని సోపపత్తికంగా నిరూపించారు. 'తెళుగన్నడ్డం' భాషాశాస్త్రం ప్రకారం 'తెండమ్' అవుతుందేకాని తెలుగుకాదు.

## IV. తెలుగు పదం - మరికొన్ని దేశీయ వ్యుత్పత్తులు:

1. తెళి + అగు - తెలుగు
2. తిలల వంటి గోవులు ..........
3. తేల్ + అగు - తెలుగు
4. తలైంగ్ - తెలుగు
5. తెలి + అగు - తెలుగు
6. తెల్ల + అగు - తెలుగు
7. తెనుగు - తెలుగు
8. తేనె + అగు - తెనుగు - తెలుగు
9. త్రినగ - తెనుగు - తెలుగు

### 1. తెళి/తెళియు, తేట/ + అగు - తెలుగు:

తెళి + /తెలియు, తేట/అగు - తెలుగు అని కొందరు విమర్శకులు వ్యుత్పత్తిని చెప్పారు. కన్నడ కత్తురి, తెలుగుతేట, అరవం అమృతం అనే కన్నడ సామెత ఈ పదవ్యుత్పత్తికి ఆధారం. ఎవరిభాష వారికి తేటగానూ, గుబాళింపుగానూ, మధురంగానూ తీయగానూ వుంటుంది. కాబట్టి అభిమానపూర్వకమేకాని సత్యసన్నిహితంకాదు.

### 2. తిల/నువ్వులు/వలె గోవులు/ఆవులు/ ........

తిలలవలె గోవులు వేల కొలది ఎక్కడ వుంటాయో ఆదేశం 'తెలుగు' అని ఆంధ్ర వాఙ్మయచరిత్ర సంగ్రహకారులు కల్లూరి వేంకట నారాయణరావుగారు అభిప్రాయపడ్డారు. ఈ ...త్తి సరైనదికాదు.

### 3. తేల్ + అగు - తెలుగు:

'తేల్' అనే నదీ ప్రాంతంలో కొంతకాలం నివసిం... తర్వాత ఆంధ్రప్రదేశ్ ప్రాంతానికి ప్రజలు రావటంచేత ... ప్రజలు తెలుగువారైనారని ఇంకొక వ్యుత్పత్తి. ఇది భౌగోళి... విశేషం వల్ల ఏర్పడిన వ్యుత్పత్తి. 'తేల్' అనే నది తెలుగ... దేశంలో లేదు. మీదుమిక్కిలి ప్రఖ్యాతమైందీ కాదు. అక్క... వుండటంచే ఆపేరు వీరికి కలిగినదనుటకు సరైన ఆధారాల... లేవు. 'తేల్' నదీ వాదాన్ని ఆచార్య గంటిజోగి సోమయాజిగారు, ఆంధ్రభాషావికాసము, పుట 26/ ఖండించారు.

### 4. తలైంగ్ - తెలుగు:

'ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహములో ఆచార్య... ఖండవల్లి లక్ష్మీ రంజనం 'తెలుగు' పదానికి మరో వ్యుత్పత్తిని చెప్పారు. ప్రాచీనకాలంలో బర్మాలో 'తలైంగ్' అనే జాతివారు నివసించేవారని, వీరే తెలుగు దేశానికి వచ్చి/తలైంగ్, తలేంగ్, జాతివారి నివాసభూమి తెలుంగు/తెలుగు వారయ్యారని అభిప్రాయపడ్డారు. ఈపదమే తిల్లింగు, త్రిలింగ శబ్దాలకు మూలమని ఊహించారు కూడా. తలైంగ్ లేదా తలేంగ్ వంటి దీర్ఘ తలేంగ్ వంటి దీర్ఘ మధ్య రూపాలు ప్రాచీన తెలుగు భాషలో లేని కారణంగా ఈ వ్యుత్పత్తి కూడా సమంజసమైనదికాదు.

### 5. తెలి + అగు - తెలుగు:

'తెలి' అనగా స్వచ్ఛమైన భాష కాబట్టి 'తెలుగు' అనేపేరు వచ్చిందని మరికొందరు విమర్శకులన్నారు. ఈ వాదం కూడా సమంజసమైందికాదు.

### 6. తెల్ల + అగు - తెలుగు:

తెల్ల + అగు అనేవిధంగా పదవిభాగం కావించి తెలుగు వారు తెల్లగా వుండటం చేత తెలుగువారైనారని మరికొందరు విమర్శకులు కృత్రిమంగా వ్యుత్పత్తిని కల్పించారు. తెలుగు వారందరూ తెల్లవారు కాదుకదా.

### 7. తెనుగు - తెలుగు:

'తెలుగు' పదం అర్వాచీనమనీ, 'తెనుగు' పదం ప్రాచీనమనీ కాబట్టి 'తెనుగు' నుంచే తెలుగుపదం పుట్టిందని మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు/1874-1951/ అభిప్రాయ పడ్డారు. తేన్ + ఉన్ + ంగ్ + ఉ- అని తెనుగు శబ్దాన్ని పదవిభాగం చేశారు.

### 8. తేనె + అగు - తెనుగు - తెలుగు:

'తేనె' వలె మధురమైన భాష కాబట్టి/తేనె + అగు/ తెనుగు అనే వ్యుత్పత్తిని చెప్పి, తెనుగు నుంచే తెలుగుపదం పుట్టిందని రాబర్ట్ కాల్వెల్లుగారు తెలిపారు.

(A Comparative Grammer of the Dravidian Language P. 2-7)

ఏ భాష అయినా ఆ భాషావ్యవహర్తలకు మధురంగా, తీయగా వుంటుంది. కాబట్టి విమర్శకులు ఈ వాదాన్ని ఖండించారు.

### 9. త్రినగ - తెనుగు - తెలుగు:

'త్రినగ' శబ్దం నుంచి 'తెనుగు' శబ్దం వచ్చిందని పిదప 'తెనుగు' నుంచి 'తెలుగు' వచ్చిందని విమర్శకులు అభిప్రాయపడ్డారు. మహేంద్రం, శ్రీశైలం, కాళహస్తి అనే మూడు నగాలమధ్య వున్న ప్రదేశాన్ని త్రినగదేశమని అంటారు. తినగ శబ్ద వ్యుత్పత్తిని ఆచార్య చిలుకూరి నారాయణరావుగారు/ ఆంధ్ర భాషాచరిత్రము-పుట 32/ లో ఖండించారు.

### V. తెలుగు పదం - శాసనాల్లో ప్రయోగాలు:

శాసనాల్లో నన్నయ తర్వాత తిలింగ, తెలింగ, తేలింగ, తైలాంగ, మొదలైన అనేక రూపాలతో తెలుగు పదం కనబడుతుంది. తెలుగు, తెలుంగ, తెలుంగు, ఈ పదాలన్నీ ఆంధ్రజాతి దేశభాషా వాచకాలుగానే ఉపయోగించారు.

### B. తెనుగు పదం - ప్రాచీనత, వ్యాప్తి, చరిత్ర:

I. తెనుగు శబ్దవిచారం.

II. తెనుగు దిగ్వాచి

III. తెనుగు శబ్దం - ప్రాచీన గ్రంథ ప్రయోగాలు.

### I. తెనుగు శబ్దవిచారం:

### V. తెనుగు పదం - లు:

త్రినగ - తెనుగు

ii. తేనె + అగు - తెనుగు

iii. తెన్ - దక్షిణం - సి.పి. బ్రౌన్.

iv. తెన్ - ఆధునిక విమర్శకులు

v. తెఱుక్కు - తెనుగు.

### I. త్రినగ - తెనుగు:

'తెనుగు' పదం 'త్రినగ' శబ్ద [illegible] విమర్శకుల అభిప్రాయం. త్రినగాలు అంటే, [illegible] కొండలు అర్థ[illegible] శ్రీకాళహస్తి శిఖరం, శ్రీశైలం, శ్రీమహేంద్రాచలం ఈ [illegible] త్రినగాలనీ, వాటివల్ల ఆంధ్రదేశానికి [illegible]గ దేశమని, పేరు వచ్చిందనీ అందువల్ల 'త్రినగ' పదం నుంచి 'తెనుగు' పదం ఏర్పడిందనీ విమర్శకుల అభిప్రాయం తెలుగుదేశానికి త్రినగ మనే వ్యవహారం ఎప్పుడూ ఎక్కడాలేదు. కాబట్టి ఈ రకమైన వ్యుత్పత్తి సహేతుకమైనదికాదు.

### ii. తేనె + అగు - తెనుగు:

తేనె + అగు అనే శబ్దాల కూడికవల్ల 'తెనుగు' పదం ఏర్పడిందని 'హిందూదేశపు లింగ్విస్టిక్ సర్వే, (Linguistic Survey of India) లో సర్‌జార్జ్ గ్రియర్సన్ గారు అభిప్రాయపడ్డారు. రాబర్ట్ కాల్డువెల్డ్ కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. తెనుగు తియ్యని భాషకావడంవల్లనూ,

'శబ్దసామ్యం' వల్లనూ గ్రియర్సన్, కాల్డువెల్డ్‌గార్లు, ఈరకమైన వ్యుత్పత్తిని కల్పించివుంటారు.

iii. తెన్ - దక్షిణం - సి.పి.బ్రౌన్:

'తెన్' శబ్దానికి 'దక్షిణం' అనే అర్థం వుందనీ దక్షిణాది అనే అర్థంలో తెనుగుశబ్దం ప్రయుక్తమై వుండవచ్చునని సి.పి. బ్రౌన్‌గారుతన తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు /పుట 547/ లో పేర్కొనాడు.

iv. తెన్ - ఆధునిక విమర్శకులు:

'తెన్' అంటే దక్షిణం అనీ, ఈ పదంతో కుఇ, కుని, కూబి, కోలామీ, గోండి, శబ్దాల్లోని 'కు', తో అభిన్నమైన 'గు' తో చేరి 'తెనుగు' శబ్దం ఏర్పడిందని ఆధునిక విమర్శకుల అభిప్రాయం.

v. తెఱక్కు - తెనుగు:

కొంతమంది విమర్శకులు 'తెళక్కు' నుంచి 'తెనుగు' శబ్దం వచ్చిందని పేర్కొన్నారు. తమిళంలో దక్షిణానికి 'తెఱక్కు' అని వ్యవహరిస్తారనీ తెనుగుదేశం దక్షిణదేశమై వుండడంచేత, తెఱక్కు దేశమనీ, తెలుగుదేశమనీ, వ్యవహరించడం జరిగిందని వీరి ఉద్దేశం.

'తెఱక్కు' లోని 'ఱ' కారం ఉచ్చారణలో 'ల' కారంగా మారడానికి అవకాశం వుంది. ఉదా॥

| తమిళం | తెలుగు |
|---|---|
| తఱియాదు | తెలియదు |
| ముఱుంగుకాయలు | ములగకాయలు |

'ల' కారంగా మారినట్లే తెఱక్కు/తమిళం/తెలుగుగా మారిందని విమర్శకుల అభిప్రాయం

## II. తెనుగు దిగ్వాచి:

'తెనుగు' శబ్దం దిక్కునుబట్టి వచ్చినదనేది ఒక సిద్ధాంతం. దిక్కుల్నిబట్టి కూడా దేశాల్ని, భాషల్ని వ్యవహరిస్తారు. తెనుగునాడు, తెనుగువాడు, తెనుగు మాట ఈ పదాలన్నీ తెనుగు నుంచి వచ్చినవే. 'తేన్' అంటే దక్షిణ దిక్కుఅని అర్థం. ఈ దిగ్వాచకంపై 'గు' అనే ప్రత్యయం చేరటం, వల్ల తెన్గు, తెనుగు అనే రూపాలు ఏర్పడ్డాయి. భారతదేశంలో ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన తెనుగుభాష, దక్షిణ ప్రాంతంలో వుండటం వల్ల దీని కీ పేరు వచ్చిందని ఈ వాదాన్ని చేపట్టిన వారి అభిప్రాయం. ఆచార్య గంటిజోగి సోమయాజిగారు ఆంధ్ర భాషా వికాసము/పుటలు 33, 34/లో తెనుగు దిగ్వాచి సిద్ధాంతాన్ని బలపరిచారు. ఈ వ్యుత్పత్తిని, ఆచార్య చిలుకూరి నారాయణరావుగారు ఆంధ్రభాషా చరిత్రము / పుట 33/ లో సహేతుకంగా లేదని ఖండించారు. అంతేకాక రావుగారు 'తెన్' దిగ్వాచి అనే సి.పి.బ్రౌన్ మొదలైన వారి వాదాన్ని కూడా తోసిపుచ్చారు.

## III. తెనుగు శబ్దం - ప్రాచీన గ్రంథ ప్రయోగాలు:

గ్రంథప్రయోగాల్నిబట్టి చూస్తే, 'తెలుగు' పదాన్ని కన్నా 'తెనుగు' పదమే ప్రాచీనమైంది ఎందుకంటే చాలా ప్రాచీనమైన తెలుగు సాహిత్యంలో 'తెనుంగు' 'తెనుగు', అనే రూపాంతరాలు మాత్రమే కనిపిస్తాయి. 'తెలుగు' పదం కానరాదు.

1. రాజరాజనరేంద్రుని / క్రీ.శ. 1022-1062/ ఆస్థాన కవి అయిన నన్నయ, రాజరాజనరేంద్రుడు తన్నడిగినట్లుగా తన భారతావతారికలో -

'జననుత కృష్ణ ద్వైపా
యనముని వృషభాభిహితమహా భారత బ

దెనుగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్',
ఆదిపర్వం - 16/

అనే పద్యంలో అర్థ బిందుపూర్వకమైన 'తెనుగు' శబ్దాన్ని ప్రయోగించాడు. నన్నయ 'న' కారాన్ని ప్రాసస్థానంలో ప్రయోగించాడు.

నన్నయ తన 'మహా భారతము' లో-

'సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తిలో
నారసిమేలునానితరు లక్షర రమ్యతనాదరింప నా
నారుచిరార్థసూక్తి నిధి నన్నయ భట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురు డయ్యె జగద్ధితంబుగన్'.
/ఆదిపర్వం - 26/

అనే పద్యంలో పూర్వబిందు పూర్వకమైన 'తెనుంగు' శబ్దాన్ని వాడాడు.

2. నన్నెచోడుని 'కుమార సంభవము' లో తెనుంగు పదానికి రెండు ప్రయోగాలు కనబడుతున్నాయి.

'మును మార్గకవిత లోకం
బున వెలయగ దేశికవిత బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బున జన జాళుక్యరాజు మొదలుగ బలువుర్'
/1-23/

'సరళముగా భావములు జానుందెనుంగున నింపు పెంపుతో
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థములొత్తగిల్ల బం
ధురముగ బ్రాణముల్ మధుమధుత్వర సంబున గందళింపన
క్షరములు సూక్తులార్యులకు గర్ణరసాయన లీల గాలగ్రాన్'
/1-35/

నన్నెచోడుడు తెనుంగు పదాన్ని వాడాడు. నన్నయ, నన్నెచోడుడు ఇరువురూ తెలుంగు, తెలుగు రూపాల్ని ప్రయోగించలేదు.

3. పాల్కురికి సోమనాధుడు తెనుంగు, పదాన్ని భాషాపరంగా ప్రయోగించాడు.

'ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
సరసమై పరగిన జానుందెనుంగు
చర్చింపగా సర్వసామాన్యమగుట'
/బసవపురాణం - పుట 4/

4. తిక్కన భారతావతారికలో తెనుంగుబాస, తెను గుబాస అనే పదాలు వాడాడు.

'హృదయాహ్లాది చతుర్థమూర్జితకథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాట పర్వమిట యుద్యోగాదులుంగూడ గా
బదియేనింటి దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుది ముట్టన్ రుచియించు చొప్పు బుధసంతోషంబు
నిండారగన్'
/విరాటపర్వ -7 /

'తెనుగుబాస వినిర్మింప దివ్యరుటరయ
భవ్య పురుషార్ధ తరుపక్వఫలముగాదె
దీనికెడనియ్యకొని వేడ్కమా ని కృతిప
తిత్వ మర్ధించి వచ్చితి దిక్కశర్మ'
/విరాటపర్వం - 18'

## తెలుగు, తెనుగు శబ్దాలు - సంబన్ధం, ప్రాచీనత:

### I. తెలుగు - తెనుగు శబ్దాలు - పరస్పర సంబంధం:

తెలుగు, తెనుగు శబ్దాల రెండింటికి పరస్పర సంబంధం వుంది. శబ్ద పరిణామ ప్రకారం 'ల' కారం, 'న' కారంగానూ, 'న' కారం 'ల' కారంగానూ మారడానికి అవకాశముంది. ఎందుకంటే 'ల' కారం, 'న' కారం రెండూనూ దంతమూలీయాలు (Alvealars)

(i) 'ల' కారం - 'న' కారం / ల > న / గా మారటం :

| | | | | | |
|---|---|---|---|---|---|
| లచ్చి | > | నచ్చి | లంజ | > | నంజ |
| లెగు | > | నెగు | లాంగలీ | > | నాగలి |
| లేదు | > | నేదు | లావు | > | నావు |
| లేత | > | నేత | లాగు | > | నాగు |

ii) 'న' కారం - 'ల' కారం / న > ల/ గా మారటం :

| | | | | | |
|---|---|---|---|---|---|
| మునుగు | > | ములుగు | తెనగవాళ్లు | > | తెలగవాళ్లు |
| మునగ | > | ములగ | సెనగలు | > | నెలగలు |
| మునుగోల | > | ములుగోల | చెనగు | > | చెలగు |
| తెనుగోళ్ళు | > | తెలుగోళ్ళు | జన్మం | > | జలమం |

తెలుగు, తెనుగు అనే రెండు విధాలైన మార్పులు సహజమైనవే. ల - న ల వినిమయం వల్ల ఈ రెండు రూపాలు ఏర్పడతాయి.

### II. తెలుగు - తెనుగు శబ్దాల్లో ఏది ప్రాచీనమైంది?

1. మన భాషకు తెలుగుభాష 1. అనే పేరే జన వ్యవహారంలో చాలాకాలం నుంచి ఎక్కువగా ప్రాచుర్యంలో వుంది. అంచేత తెలుగు పదమే చాలా ప్రాచీనమైందని చెప్పవచ్చు. తమిళ, కర్ణాటక ప్రాచీనశాసనాల్లో 'తెలుంగు' అనే పదమే సుస్పష్టంగా కనిపిస్తుంది.
2. తమిళ వాఙ్మయంలో చాలా ప్రాచీనమైన 'అగత్తియం' అనే లక్షణ గ్రంధంలో తెలుంగం' అని ప్రయోగించడం జరిగింది.
3. తమిళ, కర్ణాటక ప్రాచీన శాసనాల్లోనూ, ఆయాభాషా ప్రాచీన వాఙ్మయాల్లోనూ, ఆంధ్రుల ప్రసక్తి వచ్చిన

ప్రతిచోటా తెలుంగ, తెలుంగు శబ్దాలే వాడడం జరిగింది. కాని తెనుగు శబ్దం ఎక్కడ కానరాదని ఆచార్య గంటిజోగి సోమయాజిగారు/ఆంధ్ర భాషా వికాసము - పుట 20 / అభిప్రాయపడ్డారు.

4. పాల్కురికి సోమనాథుడు 'బసవపురాణములో' తెలుగు పదాన్ని ప్రయోగించాడు.
'గూర్చె దద్విపదలు గోర్కె ద్రైవాఙ
దెలుగు మాటలనంగా వలదు వేదముల
కొలదియకాజూడు డిలనెట్టులని'న
/బసవ పురాణం - పుట 4/

5. తిక్కన 'నిర్వచనోత్తర రామాయణము' లో ప్రాసస్థానంలో 'తెలుగు' పదము కనబడుతుంది.
'తెలుగు కవిత్వము చెప్పం
దలచినకవి యర్థమునకు దగియుండెడుమా
డలుగొని, వళులుంబ్రాసం
బులు నిలుపక, యొగిని బులిమి పుచ్చుటచదురే'
'అలవడ సంస్కృత శబ్దము
తెలుంగు బడి విశేషణంబు తేట పడంగా
బలుకునెడ లింగ వచనం
బులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్'
/1-8/

6. 13వ శతాబ్దికి చెందిన మూలఘటిక కేతన 'ఆంధ్ర భాషా భూషణము' లో తెలుగు పదాన్ని ఉపయోగించాడు.
'తెలుగున గల భేదంబులు
దెలుగై సంస్కృతము చెల్లు తెఱగులు దత్సం
ధులును విభక్తులునయ్యే
యలఘు సమాసములు గ్రియలు నవి యెఱిగింతున్'
/ఆంధ్రభాషాభూషణము - 15/

7. 16వ శతాబ్దికి చెందిన బాలసరస్వతి - తెలుగు శబ్దాన్ని ప్రాసఘటితంగా తన గ్రంథాది పీఠికలో 'తెలుంగున్ వ్యాకరణంబు' అని వాడాడు.

8. ఆరుద్రగారు తెలుగు శబ్దమే ప్రాచీనమైందని 'సమగ్రాంధ్ర సాహిత్యంలో చెప్పారు.

9. వ్యుత్పత్తిపరంగా పరిశీలిస్తే తెలుగు శబ్దమే ప్రాచీనమైందని తెలుగు వ్యుత్పత్తికోశం /సంపుటి4, పుటలు 130, 131/ కూడా నిరూపించింది.

## ముగింపు:

భాషావ్యవహర్త లనేకులు తెలుగు అని వ్యవహరించడం వల్లనూ, చాలా ప్రాచీనకాలం నుంచి ఇతర భాషా శాసనాల్లో తెలుగు పదానికే ఎక్కువ వ్యాప్తి వుండటం వల్లనూ, తెలుగు పదమే ప్రాచీనమనీ, దానినుంచే తెనుగుపదం పుట్టిందని మనం నిర్ధారించవచ్చు.

మొత్తం మీద ధ్వని పరిణామ కారణంగా 'తెలుగు' పదం నుంచే 'తెనుగు' పదం ఏర్పడిందనేది విమర్శకుల అభిప్రాయం.



# విశ్వనాథవారి నవలల్లో పేర్కొన్న ఆధునిక గ్రామనామాలు, వ్యక్తినామాలు

- డాక్టర్. అంకె. రామలింగమయ్య

మనిషి తను జీవిస్తున్న దేశకాలంతో ఒక విధమైన ప్రేమ కలిగిఉంటాడు. "జననీజన్మభూమిశ్చ స్వర్గాదపి గరియసీ" స్వర్గం కంటె తల్లి, మాతృదేశం ఈ రెండు చాలాగొప్పవని వాల్మీకి మహర్షి నాటిమాట. ఈ నాటికి అది సత్యమే. అందుకే ప్రతిదేశపౌరుడు కవి తన పూర్వకాల పట్టణ వ్యక్తి నామాలను స్మరించుకొంటూ ఉంటారు. ఒక మహాత్ముడు పుట్టిన ప్రదేశం, తిరిగిన ప్రదేశాలు, సాహిత్య శిల్పంలో చిత్రలేఖనములో, వేనోళ్ళ వర్ణింపబడినవి. ఆ మహాత్ముని జీవితంతోపాటుగా ఆయన జీవించిన దేశకాలాలు గూడ స్తుతింపబడటం, మనం బౌద్ధవాఙ్మయంలోను, పురాణ వాఙ్మయంలోను చూస్తున్నాము. బుద్ధదేవు చరిత్ర వ్రాసినవారు, ఆనాటి దేశాలు, రాజులు, ప్రజలు, పట్టణాలు సదీనదాలు, ఉపనదులు, వ్యక్తులు. వీటికి సంబంధించిన వివరాలువ్రాశారు..అవి చదివి మనకు ఆ దేశకాలవ్యక్తుల మీద భక్తిభావం కలుగుతుంది.

ప్రాచీన కళల్లో సాహిత్యం, శిల్పం, వంటి వాటిల్లో అయోధ్య, ద్వారక, వంటి పుణ్యక్షేత్రాలు వర్ణింపబడ్డాయి. తర్వాత బౌద్ధయుగంలో బుద్ధుడు జన్మించిన స్థలం, ఆయన తపస్సు చేసినచోటు, బోధివృక్షం క్రింద ఆయనకు జ్ఞానోదయమైన స్థలం, ఆయన మొదటి సారిగా బోధించిన విషయము, స్థలము, ఆయన తిరిగిన పట్టణాలు,ఆయన చేత తరించిన రాజులు, సామాన్యులు, ఊర్లు, పేర్లు, ఆయన నివసించిన వనాలు, ఆరామాలు, విహారాలలో ఉన్నవన్నీ బౌద్ధవాఙ్మయంలో బౌద్ధశిల్పంలో వేనోళ్ళ కీర్తింపబడ్డాయి. వైశాలి, కుశావతి వంటి నగరాలు అమరావతి శిల్పంలో చిత్రించిన శిల్పికి, ప్రమాణాలుగా ఉద్దేశించబడినవి. బుద్ధ దేవుడు ఏ చెట్టుక్రింద తపస్సు చేశాడో, ఆ చెట్టు ప్రపంచములో పూజింపబడుచున్నది. ఆ చెట్టున్నచోటు "బుద్ధగయ" ఈనాటికి పుణ్యక్షేత్రమే. ఆయన తపస్సు చేస్తూ రోజూ ఏనదిలో స్నానాదులు చేశాడో, అది "నిరంజన."

ఆయన మొదటిసారిగా ప్రబోధించిన ధర్మం "ధర్మ చక్ర" ప్రవర్తనా సూ[illegible] నాటికి మనకు మిగిలివున్నది. బుద్ధుడు మొ[illegible]లసారి [illegible]ంచిన స్థలమే సారనాథ్. అక్కడే అశో[illegible]చక్రవర్తి ఒక సూ[illegible]న్ని కట్టించాడు. ఒక పెద్ద ఆలయా[illegible] [illegible]గృహాన్ని నిర్మిం[illegible]శాడు. ఇప్పటికీ [illegible] శిధిలా[illegible] [illegible]కు కన్పిస్తున్నాయి ఆ మహాను[illegible] [illegible]ద భక్తిచేత "అనాధపి[illegible]డకుడు" అనేవాడు జేత[illegible]న్ని స[illegible]ర్పించాడు. ఈ పే[illegible]న్ని ఈ నాటికి మన స్మ[illegible]పథంలో [illegible]ద్రంగా ఉంటూ నెమరు వేసుకున్నప్పుడల్లా కన్నుల్లో భాష్పబిందువుల్ని కలిగిస్తూ ఒక పవిత్ర మధు[illegible] భావాన్ని అనుభవింపజేస్తున్నాయి.

వాల్మీకి మహర్షి తన [illegible]రామాయణంలో రాముడు సంచరించిన రాజ్యాలు ప్రదేశాలు అడవులన్నింటిని[illegible] వర్ణించాడు. పంచవటి మొదలగునవి. ఈ [illegible]నాటికి పవిత్ర క్షేత్రాలుగా ఉండి ఆనందాన్ని కల్గిస్తున్నాయి. విశ్వకవి రవీంద్రనాధ్‌ఠాగూరు కాళిదాసుని గూర్చి వ్రాస్తూ ఇలా అన్నారు

"ఆమహాకవి వర్ణించిన దేశాలు, ప్రదేశాలు, వనాలు, నదీనదాలు, ఎంతకమ్మని అనుభూతిని ఈనాటికీ మనకు కల్పిస్తున్నాయో చెప్ప[illegible]నికి వీలులేదు. ఆనామాలు (పేర్లు) ఎంతమధురంగా ఉంటాయో వర్ణించలేము. సిప్రానది, అలకనంద అలకానగరం వంటిపేర్లు ఈనాటికి మనస్మృతపథంలో మా[illegible]పోలేదు."

కనుక కవులు, శిల్పులు, తమ కళలద్వారా ప్రాచీన దేశకాలాలలోను, భద్రపరచి రాబోయే యుగాలవారికి చరిత్రజ్ఞానాన్ని ఇవ్వడంతోపాటు, వాటిమీద ఒక పవిత్ర భక్తిభావాన్ని గూడ కల్గిస్తున్నారు. మహాకవి చేత వర్ణింపబడిన

కందుకూరు, అనంతపురం మండలం మరియు జిల్లా

ప్రతిదీ చరిత్రలో ఈవిధంగా నిలిచిపోవడంతో పాటు దాన్ని రాబోయే తరాలవారికి అందిస్తున్నారు. మనకు భక్తి భావాన్ని కల్గిస్తున్నారు. ఇదే దేశభక్తికి ప్రధానలక్షణం. ప్రతికవి తానుజీవించిన యుగాన్ని వ్యక్తులను వర్ణిస్తాడు. అప్పుడు అవి శాశ్వతములైపోతున్నాయి. చారిత్రక నగరాలైన పాటలీపుత్రం, తక్షశిల, విజయనగరం, ఆనాటి చరిత్రతోపాటు మనకు అపూర్వ వారసత్వంగా మిగిలిపోయినాయి. ఆంధ్ర ప్రబంధ కవులు ఆనాటి తెలుగుదేశాన్ని నదీనదాలను, పట్టణాలను, సామాజిక వ్యవస్థను,రాజులను , ప్రజాజీవితాన్ని అందంగా వర్ణించడం వలన అవన్నీ దక్కినవి. చరిత్ర కారుడు చెపితే మనకు విషయం తెలుస్తుంది తప్ప వాటియందు భక్తిభావం కలగదు.

ఉదాహరణకు 'శ్రీ విలుబుత్తూరు'' వర్ణన ఆముక్త మాల్యదలో మహాకవి చేశాడు. ఇది చదివినపుడు మనభావనా పధంలో కనిపించే విలుబుత్తూరు భాగవతంలోని 'వేపల్లె' వంటిది, ఒక మధురానగరం వంటిది అవుతుంది. దేశ కాలాలు కళాబద్ధమైనపుడే అవి మన నిత్య జీవితంలోకి సంక్రమించి ఆనాటి దేశకాలాలకు, మనమున్నదేశ కాలాలకు ఒక సంబంధాన్ని కల్పిస్తాయి. కనుక ఒక కావ్యంలో నిబంధింపబడిన చెట్లు, పుట్టలు, నది, కొండ, ఊర్లు, పేర్లు, అన్నీ మనలో స్థిరత్వాన్ని పొందుతున్నాయి.

## ఆధునిక గ్రామనామాలు

విశ్వనాధమహాకవి శతాధిక గ్రంథకర్త. ఆయుగంలో వారి గురువులు కూడా శతాధికగ్రంధకర్తలే గాని, విశ్వనాధకవి సాహిత్యంలో చేసిన ఘనకార్యం, వారు చేయలేకపోయారు. అదేమంటే ఆ కవి సమకాలికమైన దేశకాల సామాజిక వ్యవస్థను చిత్రించారు, వ్యక్తుల స్వభావాలను, ఆ వ్యవస్థలను తెలుగుదేశ ప్రకృతిని, నదీనదాలను, కొండలను, నగరాలను, ఊర్లను అక్కడి జీవిన విధానాన్ని, పల్లెటూళ్ళ వాటి అందాలను, పట్టణాల్లో ఈనాడు అధికారులు చేస్తున్న అన్యాయాలను ఒకటేమిటి ఆయన జీవించిన కాలంలో తెలుగుదేశం ఎలాగుందో దానిని కావ్యగతంచేశారు. వారు 'శార్వరినుండి శార్వరిదాక'' అన్న నవల వ్రాశారు. ఆ నవలలో కవి జీవించిన అరవైయేళ్ళ కాలంలో దేశంలో వచ్చిన మార్పుల్ని మానవుల మధ్య గల సంబంధాలు, స్నేహానురాగాలు చెడిపోవడానికి కారణాలు అద్భుతంగా చిత్రించాడు. ఇతర నవలలనిండా తెలుగుదేశంలో ఉన్న,ఊర్లు, నదులు, కొండలపేర్లు ఒకటేమిటి తెలుదేశాన్ని అంతా పడుగుపేకగా వేసిన పట్టుచీరగా చిత్రించారు. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వంలో ఆముక్తమాల్యద గూర్చి వ్రాస్తూ అన్న ఈ మాటలు వారికి అన్వయిస్తాయి. "ఆంధ్రసరస్వతికి ఒక బెనారస్ పట్టుచీరవున్నది. దానిపేరు ఆముక్తమాల్యద . ఇ విశ్వనాధ సాహిత్యానికి అనువర్తిస్తుంది." ఆముక్తమాల్యదలో ఏవిధంగా దేశకాలవ్యవస్థ కవిత్వంగా పరిణమించిందో అదేవిధంగా విశ్వనాధసాహిత్యంలో కూడ మనమెరిగిన ఈ నాడున్న తెలుగునాడు అద్భుతంగా ప్రతిబింబించింది. అవి చదివినపుడు మనం చూచిన ఉపేక్షించిన పొలాలు, నదీనదాలు,పువ్వులు, అన్నీ దర్శనమిస్తాయి. ఒక గంగరావిచెట్టు, ఒక గమ్మడిపూవు, వానకాలంలో పిల్లల కాగితపుపడవలు, అదేకాలంలో వరిచేలలో విచ్చిన కాజపూలు, నమ్మపూలు, ప్రకృతి వంటి సహజ వస్తువులేకాక ఊర్లపేర్లు, వ్యక్తులపేర్లు, కనబడతాయి. ఉదాహరణకు "చందవోలురాణి' ' అన్న నవలలో చందవోలు నగరాన్ని వర్ణించిన తీరు ముందుచెప్పిన అమరావతి శిల్పి, శిల్పంలో మలచిన వైశాలినగరముగా ఆశ్చర్యకరంగా సాక్షాత్కరిస్తుంది. ఈ చందవోలు తెనాలి దగ్గరుంది. ఆయన 'కిన్నెరసాని పాటలు' ' పీఠికలో

> వనములను దాటి "వెన్నెలబయలు" దాటి
> తోగులను దాటి దుర్గమాద్రులను దాటి
> పులుల యడుగుల నడుగుల కలుపుకొనుచు
> రాళ్ళవాగు దాటి పధాంతరములు దాటి
> ఆచటి కెన్నెరసాని . . . . . . . . . . ."

అన్న పద్యములో 'వెన్నెలబయలు' అనేది భద్రాచలం దగ్గర ఉన్న అడవుల్లో ఒక 'కోయగూడెం' (ఈమాట మా పర్యవేక్షకులైన ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావుగారు నాతో అన్నారు) అట విశ్వనాధవారు ఆంధ్రదేశంలో ఎక్కనికొండ, చూడని ప్రదేశం, వర్ణించని ప్రాంతాలు లేవంటే అతిశయోక్తి కాదు. 'వేయిపడగలు' నవల్లో ధర్మారావు అతని మిత్రుడు చారిత్రక స్థలాలను చూచుటకు వెళ్ళినప్పుడు వారు 'కొండవీడు' గురించి చెప్పారు.

'బద్దన్న సేనాని' నవలలో బాదమ్మ పుట్టిపెరిగిన వూరు ప్రస్తావింపబడినది. ఆ ఊరు గోదావరి జిల్లాలో ఇప్పుడున్నది. జేబుదొంగలు నవల్లో బరంపురము, పర్లాకిమిడి నేడు ఒరిస్సాలో చేరి పోయిన తెలుగు పట్టణాలు, వాటి వర్ణనలు యదాతథంగా చిత్రించబడినాయి. బెజవాడ, గుంటూరు, హైదరాబాదు, వంటి పట్టణాల చిత్రణ చాలాచోట్ల వున్నది.

'ఆరునదులు' అన్న నవల్లో నవాబుపాలెం, నిజాంపట్నం, బెజవాడ, గుంటూరు ప్రాంతాల్లో వున్న వూర్లే. నిజాంపట్నం,రేపల్లె దగ్గర సముద్రం ఒడ్డున ఉన్నవూరు. అక్కడనుండి మద్రాసు, బరంపురం, హైదరాబాదు, బెంగుళూరు మధ్యవున్న "ఆంధ్రదేశాన్ని', వర్ణించినారు. వారు వ్రాసిన "చిన్నకథలు" అన్నపుస్తకంలో 'మాక్లీ' అన్న చిన్నదుర్గం ఉన్నది. బెంగుళూరునుండి అనంతపురంకు వస్తున్నదారిలో యాభైకిలోమీటర్ల దూరంలో ఒకరైల్వేస్టేషను. 'వేయిపడగలు' స్వర్గానికి నిచ్చెనలు, తెఱచిరాజు మొదలగు నవలల్లో కథావాతావరణమంతా బందరు, విజయవాడ, గుంటూరు, నెల్లూరుల మధ్యవున్నదే.

'స్వర్గానికినిచ్చెనలు' అన్ననవలలో ప్రారంభంలోనే ఒక కొండ వర్ణింపబడింది. అది 'మొగలరాజపురంకొండ' సాహిత్యంలో చిత్రించబడలేదు. 'రోరిచ్'అన్నరష్యాచిత్రకారుడు భారతదేశం వచ్చిస్థిరపడిపోయి, ఈ సంస్కృతికి అంజలించి, ఈ దేశాన్ని బొమ్మల్లో చిత్రించాడు. అతడు గీచిన హిమాలయ పర్వతచిత్రాలు కళావేత్తల మన్ననలు అందుకొన్నవి. అలాగే 'స్వర్గానికి నిచ్చెనలు' లో మొగలరాజపురం కొండను విశ్వనాథవారు అద్భుతంగా చిత్రించారు. వేయిపడగల్లో సుబ్బన్న పేట అక్కడి మనుషులు, మనస్తత్వాలు, ఆచారాలు, పండుగలు పబ్బాలు, పంటలు పొలాలు, కొండలు నదులు, పేర్లు అన్నీ రోజు మనం నిత్యజీవితంలో చూస్తున్నవే అవన్నీ ఆయన నోటినుండి కవితా సంగీతమయంగా గానం చేయబడి, మన హృదయాల్లో తెలుగదేశం మీద అద్భుతమైన భక్తిభావాన్ని కల్గిస్తున్నాయి. వేయిపడగలో సుబ్బన్నపేట ప్రక్క ప్రవహించే ఒక వాగు పేరు 'గుండేరు' కృష్ణాగోదావరి డెల్టా ప్రాంతంలో ప్రవహించే చిన్నచిన్నవాగులు అలా చాలా చిత్రమైన పేర్లలోని తెలుగుదనాన్ని కవిగానం చేస్తాడు. చిలకలదిబ్బఏరు, బెరగండపాయ, నాగులేరు, చంద్రవంక, కృష్ణాగోదావరి, పెన్న ఇవన్నీవిశ్వనాథ సత్యనారాయణ గారు వర్ణన చేసినవే. కృష్ణానదిని గూర్చి విశ్వనాథవారు మాస్వామి తెలుగుబుతువులు' ' లో 'శరదృతువు' వర్ణనగూర్చి

తెక్కలుచాఁచి తీరికగాఁగ గాలిలో (
దేలిపోయెదు నంచవోలె వచ్చి
సిత వస్త్రకృగరున్మతి నృత్తసమభంగ
తురికీల నర్తకి సరణి వచ్చి
ఇరుదెసల్ కాంతిచే నొరయ సూర్యున కెదు
రౌ సితాంబుజలక్ష్మి యట్లు వచ్చి
నిమ్నోన్నతములు లేని కులాంగనాచ్చకూ
లంకష ప్రేమ కల్పముగ వచ్చి"

అని చెప్పగా దీనిని తుమ్మపూడి కోటీశ్వరరావుగారు తన "శ్వేతపద్మం"లో చేర్చారు.

## వ్యక్తుల నామాలు

ఈ నాడు గ్రామనామాలు, వ్యక్తినామాలు ఆధునికంగా విశ్వవిద్యాలయములో ఒకప్రత్యేక పరిశోధనా విషయముగా బోధింపబడుతున్నవి. దీనికి నామశాస్త్రం అనిపేరు. ఈ శాస్త్రదృష్ట్యా ఈ నామాలు విశ్లేషింపబడి వివరింపడుతున్నవి. విశ్వనాథ వారి నవలల్లో కొన్ని వేల పాత్రలు కన్పిస్తాయి. ఆ పాత్రలకు పేరు పెట్టిన విధానంలో దేశకాల లక్షణాలు, తెలుగుదనం ప్రతిబింబిస్తాయి. చారిత్రక నవలల్లో పేర్లు వేరు, పురాణ నవలల్లోపేర్లు పెట్టే పద్ధతులువేరు, ఆధునిక సామాజిక నవలల్లో పేర్లు వేరుగా ఉన్నాయి.

శాసనాల్లో పురాణాల్లో మనకుకనిపించే పేర్లు ఈనాడు ఎవరూ పెట్టుకోరు. పొట్టిశర్మ, కోలశర్మ టిట్టిభిశెట్టి, మంచన, తిక్కన, వల్లభరాయుడు, శ్రీనాధుడు, వంటిపేర్లు చారిత్రకనామాలు దేవవ్రతుడు, కాత్యాయనుడు,మేధావిభట్టు జయద్రదుడు వంటి పేర్లు. పురాణకాల వ్యక్తులనామాలు, ఇప్పటిపేర్లు ధర్మారావు, నారాయణరావు, వెంకటేశ్వరరావు, కోటీశ్వరరావు ఇలా ఉంటాయి. విశ్వనాథవారు ఈ మూడు రకాల నవలలు వ్రాశారు. కనుక ఈ మూడురకాల వ్యవహార నామాలు కన్పిస్తాయి. ఇదొక పద్ధతి. పాత్ర ఒక భావానికి సంకేతమయిపుడు ఆనామం ప్రతీకప్రాయం అవుతుంది.

కిరీటి ధర్మారావు వంటి పాత్రలుకొన్ని వారి నవలలో ఉన్నాయి. కొన్ని పా[illegible] [illegible]క ప్రతీక నామాలు. రెం[illegible] అనన్వయిస్తూ ఉం[illegible] [illegible]ర్మారావు, మంగమ్మ, వ[illegible]టి పాత్రల నామకరణం [illegible]ంలో, కవి [illegible]స్వహస[illegible] [illegible] కన్పిస్తాడు. 'వీరవల్లడు' నవల్లో 'ఆపదలో ఉన[illegible] [illegible]టుంబాన్ని కాపాడి గట్టెక్కించిన ఒక పాలేరు[illegible] [illegible]ందారు తన కుటుంబంలోని తన కుమా[illegible] [illegible]వల్లని' పేరు పెట్టడంలో కవికున్న ఔచిత్యాన్ని [illegible] [illegible]వచ్చును. పాలేరయిన 'వీరవల్ల'ని పేరు తనకు పెట్టారని, జమీందారు కుమారుడు ఆపేరుబాగా లేదని, పాలేరును పనిలొంచి తీసివేయాలని పట్టుబట్టినా కుమారున్ని కూడ లెక్కచేయకుండ, పాలేరుపేరునే జమీందారుకు పెట్టుడం పనివానియెడల గల ఆత్మీయతను గమనించ వచ్చును.

విశ్వనాధవారి 'చెలియలికట్ట' నవలలోని పేర్లను చెప్పేముందుగా పురాణమైన వాల్మీకి రామాయణంలోని పాత్రలతో కొద్దిగా పోల్చడానికి ప్రయత్నిస్తాను. సీతారామలక్ష్మణులు లోకంలో పవిత్రులు, శ్రీరాముడు ఏక పత్నీవ్రతుడుగా ఉండి తన ధర్మాన్ని నిర్వర్తించి, ధర్మాత్ముడైనాడు. లక్ష్మణుడు రామునికి తమ్మునిగా సీతాదేవికి మఱిదిగా ఉండి అన్నను వదినను గౌరవించి తన వంతు ధర్మాన్ని నిర్వర్తించి ధన్యుడైనాడు. ఆ విధంగా సీతారామ లక్ష్మణుల పేర్లు పవిత్రమైనవి. ఆధునికంగా మన విశ్వనాధ 'చెలియలికట్ట' నవల్లో శ్రీరామచంద్రునిగా సీతారామయ్యే పేర్కు, (లక్ష్మణునికి విరుద్ధ పాత్రగా) రంగారావును చెప్పవచ్చు. రామాయణంలో లక్ష్మణుడు తన పాత్రధర్మాన్ని నిర్వర్తించినట్లు; చెలియలికట్ట నవల్లో అన్న వదినలపై, రంగారావు తన పాత్రధర్మాన్ని నిర్వర్తించలేక 'చెలియలికట్ట'ను దాటాడు. రత్నావళికూడ వదినగా తన ధర్మాన్ని నిర్వర్తించలేకపోయింది. ఒక్క సీతారామయ్యమాత్రం తన పేరును సార్ధకం చేసుకున్నాడు.

'శార్వరినుండి శార్వరిదాక' లో సంగమయ్య, గంగారెడ్డి జమీందారులు. వీరిమాట గ్రామంలో శాసనము, వీరికి కూడ ప్రజలంటే భయము, భక్తి ఉండేవి. కుటుంబాన్ని చూసినట్లు గ్రామాన్ని అన్నివేళలా చూసేవారు. అదే గ్రామంలో 'వీరడు' కల్లుగీసుకొనే కలాలివాడు, అతనంటే గ్రామంలో ఎదురేలేదు. సంగమయ్య గంగారెడ్డి లాగనే 'వీరడు' కూడ ఒక పంచాయితీదారు. సంగమయ్య, గంగారెడ్డి, వీరడు ఈ ముప్వురితో పాటుగా స్త్రీలపరంగా రత్తమ్మ, అచ్చమ్మ, గ్రామంలోని పెద్దదిక్కుగా ఉంటూ తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహించేవారు, రత్తమ్మ అచ్చమ్మగార్లులో ప్రజలచేత, గౌరవాన్ని పొందడం ఒక విశేషం. కాబట్టి గ్రామాల్లో, పట్టణాలో విశ్వనాధవారి ప్రతినవలలోను పేర్లను బట్టియే కాక వారు ఉండే విధానాన్ని బట్టికూడ ఆ పాత్రలకు ప్రాముఖ్యము ఏర్పడింది.

**ముగింపు**

ఈ నామ ఉచ్చారణ సాహిత్య పరంగానేగాక, సంస్కృతిపరంగా, చరిత్రపరిణామపరంగా అధ్యయనం చేస్తే చాలా అందంగా ఉంటుంది. ప్రాచీనకాలంనుండి ఆధునికకాలందాక, 'నామం' (పేరు) ఎలా మారుతూ వచ్చిందో 'సంస్కృతి-చరిత్ర'లో అధ్యయనం చేయదగ్గ విషయం విశ్వనాధ వారు నవలారచన దేశకాలానుగుణంగా ఎలా చేశారో సూచనగా ఇక్కడ వివరించడమైనది. ఒక చారిత్రక నాటకంలో అప్పారావు, విశ్వేశ్వరరావు అని పేర్లు పెడితే చాలా విడ్డూరంగా ఉంటుంది. పాఠకులను చరిత్రకాలానికి తీసుకొని పోలేము. అలాగే ఆధునిక నవలల్లో, ప్రాచీన నామకరణాలు, కల్పిస్తే మనకు చాలా ఎబ్బెట్టుగా ఉంటుంది. కావున విశ్వనాధవారి సాహిత్య అధ్యయనంలో ఈ 'నామకరణ' (పేర్ల) ఔచిత్యం కూడ అన్నిసాహిత్య ప్రక్రియల్లాగ, చాలా అద్భుతంగా ఉంటుందని సమీక్షించడమే ఈ వ్యాస ముఖ్యోద్దేశ్యము.



# శ్రీ నృసింహ తత్త్వం

- కె. నరసింహమూర్తి

శ్రీమన్నారాయణుడు సకల జగత్ సృష్టి, స్థితి, లయకారకుడు. ఆయన పుట్టు పూర్వోత్తరముల గురించి దేవతలకు ఋషులకు కూడ తెలియదు. వారందరికి ఆయనే మూలకారకుడు.- ఆయన ఆద్యంతాలు లేనివాడు.

వేద వాఙ్మయం విశదీకరించిన, పెద్దలు ఆచరించే కర్తవ్యాలను 'ధర్మములు' అంటారు. ఎప్పటికప్పుడు దుర్మార్గాచారులు పెరిగి ధర్మాన్ని నశింపజేసే ప్రయత్నం చేస్తుంటారు. దానితో అధర్మం పెరిగిపోతుంది. శాఖోపశాఖలుగా పెరిగిన అట్టి అధర్మ వృక్షాన్ని మొదలంటా పెకలించి వేసేందుకు నారాయణుడు తనను తాను అనేక అవతారాలుగా సృజించుకొంటాడు.

వేదోక్త ధర్మాలను భగవంతుని ప్రీతికై ఆచరిస్తూ, ఆయనకొరకే జీవితాలను గడిపేవారు సాధువులనబడతారు. ఆ భగవంతుని స్మరింపక వారు క్షణకాలం కూడ ఉండలేరు. వారికి తన స్వరూపాన్ని అందించి, తన చేష్టలను చూపి, వారిని, వారి బంధువర్గాన్ని కూడ ఆనందింపచేయడమే భగవంతుని అవతారానికి ప్రధాన ప్రయోజనం. అదే 'పరిత్రాణం' అనబడుతుంది. అట్టి భక్తాగ్రేసురులను కాయికంగానో, వాచికంగానో, మానసికంగానో హింసించే వారు దుష్కృతులు.తన భక్తుల రక్షణకొరకు అవతరించిన భగవానుడు ఈ దుష్టులను వారి దుష్ప్రవృత్తికి కారణమైన ప్రోత్సాహక వర్గంతోపాటు తిరిగి తలెత్తకుండా నిర్మూలిస్తాడు. తిరిగి ధర్మసంస్థాపన గావిస్తాడు. ఈ పనులకొరకు అవసరమైన అన్ని రూపాలలో, అన్ని కాలాలలో ఆయన అవతరిస్తూనే ఉంటాడు. అనన్యచింతనతో తనను శరణువేడిన వారిని కాపాడుతూ ఉంటాడు.

ఆవిధంగా మహావిష్ణువు ధరించిన ప్రధాన అవతారాల గురించి .

శ్లో॥ మత్స్యః కూర్మోవరాహశ్చ
నారసింహశ్చ వామనః!
రామో రామశ్చ రామశ్చ
కృష్ణః కల్కీచ తే దశ!! (శాంతి 139 అధ్యా. 77శ్లో)

అని మహాభారతం దశావతారాలను పేర్కొన్నది. అందు నాలుగవది నృసింహావతారం. శ్రీ మహాభాగవతం ఏక వింశత్యవతారాలను తెలిపింది. అందు నరసింహావతారం పదునాలుగవది. భాగవతంలో మరో మూడు ప్రదేశాల్లో అవతారాల ప్రస్తావన ఉన్నది. కాని ఆయాసందర్భాల్లో అవతరాల భేదం కనిపిస్తోంది. మహావిష్ణువు అవతారాలను గురించి వివిధ పురాణాలు అభిప్రాయ భేదాలు కలిగి ఉన్నాయి. అయినప్పటికి అన్ని పురాణాలు నృసింహావతారాన్ని పేర్కొన్నాయి. చతుర్యుగములలో మొదటిదైన కృతయుగంలో మత్స్య,కూర్మ, వరాహ,నారసింహ, వామనావతారాలు సంభవించినట్లు పురాణగాథల వల్ల తెలుస్తున్నది.

వైష్ణవ సాహిత్యం మహావిష్ణువు అవతారాలను పర, వ్యూహ, విభవములని మూడు ప్రధాన భాగాలుగా గుర్తించింది. పాంచరాత్రాగమంలోని అహిర్బుధ్న్య సంహిత - పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారాలని పంచవిధ అవతారాలను వివరించింది.

"నరసింహః" అనగా "నరివ,సింహఇవ ఆకృతిర్య స్యేతి" 'నరునివలె, సింహమువలెగల రూపము ఏమూర్తికి ఉన్నదో ఆ మూర్తి నరసింహుడు అని వ్యుత్పత్త్యర్థము. "నరవత్ సింహవచ్చైవ యస్య రూపం మహాత్మనః అని మంత్రరాజ పదస్తోత్రంలో చెప్పబడింది.

తైత్తిరీయ ఆరణ్యకంలో నృసింహప్రస్తావన ఉన్నది. మహానారాయణోపనిషత్తులో నృసింహగాయత్రీమంత్రం పేర్కొనబడింది. ఇంకా నృసింహ పూర్వతాపినీయ, ఉత్తర తాపినీయ ఉపనిషత్తులలో నృసింహస్వామి మహిమ విశేషంగా

తెలుగు పండిట్, గ్రేడ్-1, ప్రెస్టన్ ఉన్నత పాఠశాల, జనగామ-506 167, వరంగల్ జిల్లా

వర్ణింపబడింది. 'సృష్టికి పూర్వం సర్వం జలమయంగా ఉండేది. సృష్టికర్తయైన శ్రీమన్నారాయణుని దివ్య సంకల్పంచే కమలం ఉత్పన్నమయింది. దాని నుండి హిరణ్యగర్భుడైన ప్రజాపతి ఉద్భవించాడు. ప్రపంచాన్ని సృష్టించాలని ఆయనకు కోరిక కలుగగా, ఘోర తపమాచరించవలసిందని ఆకాశం నుండి అశరీర వాణి వినిపించింది. దాని ననుసరించి ఆయన తపస్సు చేయగా 32 అక్షరాలు, పదకొండు పదాలు గల మంత్రరాజమైన నృసింహానుష్టుప్ పొందాడు. దానిచే క్రమంగా ప్రపంచాన్ని సృష్టించాడు" - అని నృసింహతాపనీయ ఉపనిషత్తు తెలుపుతున్నది.

ఉగ్రవీరం మహావిష్ణుం
జ్వలంతం సర్వతోముఖమ్।
నృసింహం భీషణం భద్రం
మృత్యు మృత్యుం నమామ్యహమ్॥

అనే అనుష్టుప్ మంత్రంలో నవనారసింహాల విషయం తెలుపబడింది. ఈ నవనారసింహాలు నేటికీ కర్నూలు జిల్లాలోని అహోబల క్షేత్రంలో ఆరాధింపబడుతున్నారు. కనుకనే అహోబలానికి 'నవనారసింహక్షేత్రము' అనే ప్రసిద్ధి కలిగింది. "తస్మాదిదమేవ ముఖ్య ద్వారం కలౌ" అని - నరసింహస్వామిని దర్శించేందుకు కలియుగంలో ఈ మంత్రరాజమే మార్గమని ఈ మంత్ర మహిమ పేర్కొనబడింది. "క్షీరోదార్ణవ శాయినం నృకేసరీ విగ్రహం యోగిధ్యేయం పరం పదం జానీయాత్' అని క్షీరసాగర శాయియైన విష్ణువు నరసింహుడే అని నృసింహ తాపిన్యుపనిషత్ తెలుపుతున్నది.

ఈ నృసింహావిర్భావ గాధ స్వాయంభువ మన్వంతరంలో జరిగింది. అపుడు శ్రీమహావిష్ణువు ద్వారపాలకులైన జయ విజయులు సనకాది మహర్షుల వల్ల శాపం పొంది, మూడు జన్మలలో విష్ణువుతో శత్రుత్వంతో జన్మించి, తిరిగి ఆయనను పొందేట్లు వరం కోరుకున్నారు. వారే మొదటి జన్మలో హిరణ్యకశిపు హిరణ్యాక్షులుగా జన్మించారు. పూర్వ జన్మలో వారు భద్ర, అనుభద్రులనే రుద్ర అనుచరులని, భూతగణాల ప్రేరణచే హిరణ్యకశిపు హిరణ్యాక్షులుగా పుట్టారని కూడ భాగవతంలోనే మరో మతం ఉన్నది. (III స్కం. 479 ప) ఈ సోదరులలో హిరణ్యాక్షుడే పెద్దవాడని కొన్ని పురాణాలలో ఉన్నా, భాగవతం మాత్రం హిరణ్యకశిపుడే పెద్దవాడని చెప్పింది. ఈ సోదరుల ఆగడాలను అంతమొందించేందుకు మహావిష్ణువు నరసింహస్వామిగా, ఆదివరాహమూర్తిగా అవతరించవలసివచ్చింది. తన సోదరుని విష్ణువు వరాహ రూపంలో వధించాడు గనుక, ఆనాటి నుండి హిరణ్యకశిపునికి ఆతనిపై ద్వేషం ఏర్పడింది. అందువల్ల తాను ఏవిధంగానైనా ఆయనపై పగతీర్చుకొనేందుకు పూనుకున్నాడు.

ఈ గాథ విష్ణు, బ్రహ్మాండ, విష్ణుధర్మోత్తర, పద్మ, లింగ, నారదీయ, వాయు, మత్స్య, కూర్మ, సౌర, భాగవతాది పురాణాలలో ఉన్నది. ఒక్క బ్రహ్మాండ పురాణం మాత్రం ప్రహ్లాదుడు తండ్రిని విష్ణుభక్తునిగా మార్చినట్లు పేర్కొన్నది. మిగిలిన పురాణాలన్నీ కూడ విష్ణువు నరహరి రూపంలో హిరణ్యకశిపుని సంహరించినట్లే తెలిపాయి. ఈ కథలో ప్రధానంగా దైవీశక్తి, ఆసురీశక్తుల పోరాటం కనిపిస్తుంది. చివరకు ఆసురీ శక్తులపై దైవీ శక్తి విజయం సాధించడం నిరూపించబడింది.

వైరాను బంధనంబున
చేరిన చందమున విష్ణుచిరతరభక్తిన్
చేరగ రాదని తోచును.
నారాయణ భక్తి, ముక్తి నా చిత్తమునన్॥ (స్కం.VII ప. 15)

అనే భాగవతంలోని నారదుని మాటలను బట్టి - ఇతర మార్గముల కంటె వైరభక్తి ద్వారానే సులభంగా విష్ణు సాయుజ్యాన్ని పొందవచ్చునని ఈ వృత్తాంతం ద్వారా అవగతమవుతున్నది. ఈ కథను ఎఱ్ఱన నృసింహపురాణంలో, పోతన ఆంధ్రమహాభాగవతం సప్తమస్కంధంలో తమ కవితానైపుణ్యం ఉట్టిపడేట్టు భక్తిరస భావబంధురంగా వర్ణించారు.

ఎఱ్ఱన నృసింహపురాణంలోని కథను విష్ణు, భాగవత, బ్రహ్మాండ, హరివంశ, పద్మ పురాణాదులనుసరించి దివ్య ప్రబంధంగా నిర్మించాడు. నన్నయ, తిక్కనల కవితా రీతులనే గంగా, యమునలతో, ఎఱ్ఱన వర్ణనాత్మక రీతిని సమ్మేళనం చేసి త్రివేణీ సంగమంగా మలిచాడు. పోతన సంస్కృత భాగవత కథనే ప్రధానాధారంగా చేసుకొని, సప్తమ స్కంధంలో ప్రహ్లాద చరిత్రను ఒక మనోహర ఉపాఖ్యానంగా విశదీకరించాడు. ఆ ఆఖ్యాన కథనంలో తానే ప్రహ్లాదుడుగా మారి విష్ణు మహిమానువర్ణన చేసినట్లు కనిపిస్తాడు.

ప్రహ్లాదుని సంస్కారం ఈ జన్మలోనిది కాదు. అది పూర్వ జన్మ పరమ భాగవత సంసర్గ సమాగతమైన ముకుంద చరణారవింద సేవాతిరేకమని పోతన తెలిపాడు. అందువల్లనే

ప్రహ్లాదుడు భగవంతుడైన వాసుదేవునియందు సహజ సంవర్ధమాన నిరంతర ధ్యాన నిరతుడు కావడం తటస్థించింది. భాగవతంలోని భక్తులతో పోల్చిచూస్తే, ప్రహ్లాదుని భక్తి ఎంతో విశిష్టమైందిగా గోచరిస్తుంది. ప్రహ్లాదుడెన్నడు ఆర్తుడు కాడు. అతడు పురుషకారరహితుడు. నిత్య ప్రసన్నుడు. విధి సంకల్పమే అతని సంకల్పం. భగవంతుని నిత్య ప్రసన్న భావాన్ని చూరగొన్న మహా మహితాత్ముడు. ఈ జన్మలో హిరణ్యాకశిపుని శిక్షింపనెంచిన భగవత్ సంకల్పానికి సాధన భూతుడయ్యాడు. ఇంకా - తన భక్తిచేత తాను జీవన్ముక్తుడై, తండ్రికి కూడ విష్ణు సాయుజ్యాన్ని ప్రసాదింపజేసిన మహనీయుడాయన. అందుచేతనే ప్రహ్లాదుని భక్తి మహోన్నతమైనది. ఆయన యోగీశ్వరుడైన భక్తుడు. విజ్ఞాని. చిన్నతనంలోనే నారాయణుని భూత, భావి - భవ్య అవతార బోధ మహిమను చక్కగా ఎఱిగినవాడు.

ప్రహ్లాదుని విష్ణుభక్తిని మాన్పించేందుకు హిరణ్యకశిపుడు పాములచే కరిపించి, సముద్రాలలో పడద్రోయించి, పర్వతాగ్రాలనుండి క్రిందికి నెట్టించి, శస్త్రాలచే పొడిపించి, ఏనుగులచే త్రొక్కించి, దావాగ్నులలో పడవేయించి - ఇంకా ఎన్నో విధాలుగా హింసించాడు. అయినా ప్రహ్లాదుడు ఏ మాత్రం చెక్కు చెదరక గుండె నిబ్బరంతో ఆ బాధలన్నింటినీ సహించాడు.

"సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ ।
అహం త్వాం సర్వ పాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః ।

- అని భగవంతుడు ఆనతిచ్చిన ప్రకారం తన రక్షణ ప్రయత్నాలను మానివేసి, భారమంతా తాను విశ్వసించిన నారాయణుని పైననే వదలినాడు.

"సకృదేవ ప్రపన్నాయ
తవాస్మీతిచ యాచతే ।
అభయం సర్వ భూతేభ్యో
దదామ్యేతద్వ్రతం। మమ ॥"

అని వాగ్దానం చేసిన భక్త పరాధీనుడైన నారాయణుడు కూడా తన ప్రియ భక్తుడైన ప్రహ్లాదునకు ఏ విధమగు ప్రమాదం కలుగకుండ అడుగడుగున ఆదుకున్నాడు.

"అణోరణీయాన్, మహతోమహీయాన్" అన్నట్లు - తన దాసుని తండ్రి పరీక్షించి, ప్రశ్నించినప్పుడు ఆయన తన సర్వ వ్యాపకత్వాన్ని నిరూపించి అచేతనమైన స్తంభంలో ఆవిర్భవించాడు. స్తంభం అంటే గతి నివృత్తమైనదని వ్యుత్పత్తి. సాత్త్విక భావాలలో మనసుకు కూడ అటువంటి స్థితి ఒకటుంది. మనస్సు చంచలమయింది కాబట్టి అది తన చాపల్యాన్ని విడిచినప్పుడే అందులో శ్రీహరి ఆవిర్భవిస్తాడని భావం.

"భూతేభ్యః త్వద్విసృష్టేభ్యః భయం నస్యాద్య ధామమ" అని నీ సృష్టిలోని ఏ ప్రాణి వల్ల తనకు భయం కలుగకూడదని హిరణ్యకశిపుడు బ్రహ్మ దేవుని వరం కోరుకున్నాడు. ఆ బ్రహ్మ సృష్టిలో ఈ నరసింహ రూపం లేదు గనుక నారాయణుడు ఈ రూపం ధరించాడు. భగవంతునికి అసాధ్యం ఏదీ లేదనే విషయం ఇది నిరూపిస్తున్నది.

నృసింహుడు స్తంభం నుండి సంధ్యా సమయంలో ఆవిర్భవించాడు. హిరణ్యకశిపుడు పగలుగాని, రాత్రిగాని చావరాదని వరం కోరుకున్నాడు. కనుక విష్ణువు అతన్ని సంహరించేందుకు అపుడు అవతరించవలసి వచ్చింది. సంధ్య అంటే చక్కగా ధ్యానం చేసే సమయం. సమ్యక్ ధ్యానం చేతనేగదా శ్రీహరి ప్రత్యక్షమయ్యేది!

సమస్త అస్త్ర శస్త్రాలతో తనకు మృత్యువు కలుగకూడదని హిరణ్య కశిపుడు కోరుకున్నాడు. అందుచేత శ్రీహరి అతనిని గోళ్ళతో చీల్చవలసి వచ్చింది. నఖరం అంటే ఖరం కానిది. అంటే మెత్తనిది అని అర్థం. కనుక లోకంలో కఠిన చిత్తుని కూడ మెత్తని మాటలతో ఛేదించవచ్చునని సూచన.

ఈ విధంగా అవతరించిన నరసింహుడు యావద్భారత దేశంలో - ముఖ్యంగా మన ఆంధ్ర దేశంలోని సింహాచలం, అహోబిలం, మంగళగిరి, యాదగిరిగుట్ట - మొదలైన ఎన్నో ప్రసిద్ధ క్షేత్రాలలో అనాదిగా ఆరాధింపబడుతున్నాడు. ఈదేవ దేవుని అవతార గాథను ఎఱ్ఱన, పోతనాది మహాకవులు ప్రత్యేక గ్రంథాలుగాను, ఇతర ప్రసిద్ధ కవులు తమ రచనలలో ఆయా సందర్భాలలోను, త్యాగరాజు, అన్నమయ్య వంటి వాగ్గేయకారులు తమ సంకీర్తనలలోను భక్తి భావ బంధురంగా వర్ణించారు.

# శ్వేతరాత్రుల్లో ఉద్యమ నేపథ్యం

- చల్లబట్ల వెంకట్రాంరెడ్డి (ఎం.ఏ)

ప్రాకృతిక వ్యవస్థలో బలవంతుడు బలహీనుణ్ని దోచుకోవడం అనేది యాదృచ్ఛికంగా ప్రారంభమైనా అది కాలక్రమంలో సమాజంలో ఒక పెరికి వేయలేని మహావృక్షంగా మారిపోయింది. చిన్న చేపలు పెద్దచేపలకు బలైనట్లు బలవంతుల ఆధిపత్యం వేళ్లూనింది. ఆధునిక కాలంలో దోపిడీచేసేవారు పెట్టుబడి దారుడిగానూ, దోపిడీకి గురయ్యేవాడు కార్మికుడు, పీడితునిగానూ, వర్గవిభజన జరిగి వర్గ పోరాటం మొదలైంది. ధనికవర్గం తమ అధిపత్యాన్ని నిలుపుకోవడానికి ప్రయత్నం చేస్తుంటే శ్రామిక వర్గం తమహక్కుల్ని కష్టార్జితాన్ని కాపాడుకునే ప్రయత్నం చేస్తున్నది. అయితే ఈ పోరాటంలో ఎప్పుడూ ధనికులధే పైచేయిగా ఉంటూ వస్తున్నది. మట్టినుండి మాణిక్యాలు తీయాలని మహత్తరమైన కలలు గనేవాణ్ణి మట్టిలో గలుపుతూ, వారు సాగించే ఆగడాల్ని ఉద్యమస్ఫూర్తితో ఎదిరించేవారిని పోలీసుల అండతో అక్రమ విధానంలో హతమారుస్తూ, విప్లవాత్మకమైన మార్పుల్ని ఆశించే ఉద్యమాల్ని నిర్వీర్యం చేయడం వంటి అంశాల్ని తీసికొని కరీంనగర్, ఆదిలాబాద్, వరంగల్ వంటి ఉత్తర తెలంగాణా ప్రాంతాన్ని కేంద్రంగా తీసుకొని నక్సల్బరీ ఉద్యమాల సారాంశం నుండి, సమాజంలోని అంతరాంతర కణాల్లోకి ప్రవేశించి పరికించి చూసి ఆ ఉద్యమాల సారథ్యంతో వారు అక్కడి పెట్టుబడిదారి భుస్వామ్య అధికార వర్గాల్ని ఏవిధంగా ఎదుర్కొంటున్నారు అనే విషయాల్ని ఉత్తర తెలంగాణా ఉద్యమ చిత్రంగా వెలుగులోకి వచ్చిన కథా సంకలనం ఈ "శ్వేతరాత్రులు" అటు చీకటి నిండిన రాత్రులు కావు. వెలుగుపంచే రాత్రులు అసలేకావు. తెల్లమబ్బుపొరల్తో కప్పివేసి, ఆశామయజీవితాన్ని గడిపే శ్వేతరాత్రులవి.

అమాయకులైన ప్రజలు ధనవంతుల, అధికారుల ఆగడాలకు గురవుతూ, నిత్యం వారి పాదాల క్రింద అణగద్రొక్కబడుతూ ఉండి, ఒక్కసారే ఉద్యమస్ఫూర్తితో వెల్లువలా తిరగబడితే సంభవించిన విప్లవాత్మకమైన మార్పులు బయటికి కనిపించాయి. ఇంతకు ముందు పాలేర్లని, కూలీలని "లంజెకొడకా, లంజెముండా" అని పిలిచే పిలుపు స్థానంలో పేర్లకు ప్రాముఖ్యం వచ్చింది. పంచాయితీలు ఊరిపెద్దల చేతుల్లోంచి జనం చేతుల్లోకొచ్చాయ్. పెండ్లిళ్లు పండగలు గ్రామ పెద్దల కనుసన్నల్లో కాకుండా తమంతట తామే జరుపుకుంటున్నారు. ఇలా ఒకటనేమి అన్నీ టి గుర్తుపట్టలేనంతగా మారిపోయాయి.

శ్వేతరాత్రుల్లో కథల్ని పరిశీలించి చూసినట్లయితే అందులో సమిష్టి పోరాట స్వభావం కనబడుతుంది. నిజాంల పరిపాలనలో భూస్వాములుగా చెలామణి అయి వందల ఎకరాల భూముల్ని సంపాదించు కొని దానిని కంటికి రెప్పగా కాపాడుకుంటూ వచ్చి, దున్నుకొనేందుకు చారెడుభూమిలేని పేద ప్రజలు భూసంస్కరణోద్యమం అమలులో భాగంగా నడుంబిగించి ఒక్కసారిగా తిరగబడితే, సంభవించిన హఠాత్పరిణామం భరించలేని భూస్వామి భార్య మరణిస్తే జరుగుతున్న తంతు కార్యక్రమం "చావువిందు" ఈ కథలో పాలేరు పరుగెత్తుతూ వచ్చి

"దొర్సానీ .... పెరట్లో జెండాలు పాతింద్రూ..."

" ఎర్రజెండాల్ పాతింద్రూ ఊళ్లె మాదిగ మాన్నెలు సబ్బండ వర్ణాలు బాంచెన్ జెర్రికి సీమలు తగిలినట్లు"

అనే పాలేరు మాటలువిని భూస్వామిభార్య కంటికి రెప్పలా కాపడుకున్న భూమి తమకు కాకుండా పోతుందనే భాదను భరించలేక అక్కడే కుప్పకూలి పడి మరణిస్తుంది.

ఆ పాతిన ఎర్రజెండాలు భూముల్లోకాదు. భూస్వాముల గుండెల్లో. . . , నర్సింహ్మారెడ్డి మనస్సు వందల ఎకరాల

త్రిపురారం పోస్టు మరియు మండలం, నల్లగొండ జిల్లా-508 358

భూమిపై గిరికీలు కొడ్తుంది. ఒక ప్రక్క కట్టుకున్న పెళ్లాం పోయిందనే భాధ, మరోప్రక్క అంతకు మించి తాను ప్రాణానికి ప్రాణంగా చూసుకునే భూమి తన చేజారి పోతుందనే తపన, దానిని ఎలాగైనా కాపాడుకోవాలి అనే ప్రయత్నంలో సతమతమవుతూ ఉంటాడు. "భూముల్లో చెట్లకు కట్టిన ఎర్రజెండాల్ని పీకెయాలనిపించింది. ఒక్క ఉదుటున ఊరికి త్రొక్కి పారేస్తే ... " అని అనిపించింది. నర్సింహ్మారెడ్డికి. కాని పీకే ధైర్యంలేదు.

ఆ ఎగిరే ఎర్రజెండాలు భూస్వామ్య ధనిక వర్గాలపై జరిపిన పోరాటంలో అమాయకులైన పేదప్రజలు చిందించిన నెత్తురుతో ఎరుపెక్కాయి. వాటిని పీకేసే శక్తి ఎవ్వరికీ లేదు.

ఈ భూములూ, భవంతులూ, అధికారం ఇదంతా శాశ్వతమనుకున్న నర్సింహారెడ్డి తమ ముందె ఇదంతా తలక్రిందులై పోతుందని ఊహించలేదు. ఇన్నిరోజులు భూస్వాముల చెప్పుచేతల్లో మెలిగిన జనం వాళ్ళ కల్లబొల్లి మాటల్తో ఒకరికొకర్ని దూరంఅయి ఐక్యతను కోల్పోయారు. కాని ఆ పేదవాళ్ళ కోపం ఒక్కటై పేనిన త్రాడు ఎంతటి మదపుటేనుగునైనా లొంగదీస్తుంది. ఆ శక్తి అంత గొప్పది. పేదలు చీమల్లాంటివారు, వారు పీడితుడనే పాముని చూస్తూ ఊరుకోరు. సంఘటితమైతే వారి శక్తి చాలా గొప్పది. అందుకోసం వారు శత్రువును లొంగదీయడానికి పోరాడతారు.

"వందలెకరాలు సాగుచేసిన నాకు పదెకరాలా.....!"

"నేనూ నా కొడుకూ నాగలికట్టి దున్నుకోవాలా!"

అనే నర్సింహారెడ్డి మాటల్ని బట్టి చూస్తే..... దున్నేవానికే భూమి, అంతే తప్ప భూస్వామి పాలేరు అనే తేడా లేదు.

కృష్ణారెడ్డి వంటి భూస్వాములు ఈ పోరాటంతో వేగలేక వున్న భూముల్ని మొత్తం కోల్పోయి పట్టణాల వైపు పరుగెత్తడం జరిగింది. అలా అనేక కుటుంబాలు ఈ ఉద్యమాల వెల్లువతో పట్టణాల వైపుకు కొట్టుకు పోవడం జరిగింది.

నర్సింహ్మారెడ్డికి కనుచూపు మేరలో మామిడి తోటల్లో, నల్లరేగడి భూముల్లో ఎగురుతున్న ఎర్రజెండాలు కనిపిస్తున్నాయి. ఆ ఎగిరే జండాల్ని చూడలేక కండ్లు మూసుకున్నాడు. కండ్లు మూసుకుంటే ఆ జెండాలు ఎగరడం ఆగిపోదు.

ఇంతకాలం కూటికి, గూడుకు, గుడ్డకు శ్రమపడి దోపిడీకి గురై కడుపులో దాచుకున్న ఆవేదనను సహించలేక తిరగబడితే శ్రీశ్రీ మాటల్లో....

"కాల్చే ఆకలి కూల్చే వేదన
దారిద్ర్యాలు దౌర్జన్యాలు
పరిష్కరించే బహిష్కరించే
బాటలు తీస్తూ....."

ఈ విధంగా పరిష్కారం కోసం పాలేర్లు, కూలీలు కార్మికులూ, కర్షకులూ పోరాట మార్గంలో వెళితే ధనిక భూస్వామ్య వర్గాలు ఎంత కన్నీటి పాలవుతాయో! వారు కార్చే ఆ కన్నీరే ఈ ఉద్యమాల్ని మిన్నంటేలా చేస్తుంది అనడంలో సందేహం లేదు.

తను తన కుటుంబం అనే స్వార్థాన్ని విడనాడి తన తోటి వారికోసం, ముప్పూటరవై రోజులూ కష్టం చేసినా దొరల దౌర్జన్యానికి బలైపోయేవారి బ్రతుకుల్ని బాగు చేసేందుకు, గాలయ్య వంటి ఉద్యమకారుల ప్రభావం చేత తాను కూడా ఉద్యమాల్లో చేరి ఇలాంటి పోరాటానికి నడుం బిగించిన వ్యక్తి మొగిలి. ఇతడు పేద రైతు కుటుంబానికి చెందినవాడు. ఉద్యమాల ద్వారా సమిష్టిగా భూస్వాములకు వ్యతిరేకంగా పోరాడేందుకు సిద్ధమై.

"దున్నేవానికే భూమి"
"పల్లెల్లో పోలీసు క్యాంపులు"
"ఎత్తివేయాలి".
"దొరల జులుం
నశించాలి"

అంటూ.......తిరగబడడం.

ఆరుగాలం కష్టం జేసి పంట పండించేది కూలీలు, కాని దాన్ని అనుభవించేది దొరలు, భూస్వాములు. పల్లెల్లో నెలకొన్న పోలీసు క్యాంపులు అక్కడి దొరల, భూస్వాముల చెప్పు చేతల్లో ఉంటాయి. ఆ పోలీసుల చేత ఉద్యమకారులు, నక్సలైట్లు అనే ముద్రవేసి, అణచివేతను భరించలేని పోరాట తత్వంగల పేదవారిపై దాడులు చేయించి వారిని హతమార్చేందుకు పూనుకుంటారు, ఈ దొరలూ,

భూస్వాములు. అందుకే అలాంటి వ్యక్తుల్ని అంతరింపజేసేందుకే ఈ ప్రజా పోరాట ఉద్యమాలు. ఈ ఉద్యమాల ఫలితం కొన్ని కేసులు, ఘర్షణలు. గ్రామాల్లో ఉద్యమపు గాలులు వీచి ఊగిన చెట్టులా ఊరు ఊరంతా ఊగింది. ఆ చెట్టు కొమ్మ కొమ్మ రెమ్మ రెమ్మ ఆకాకు కదిలిపోయినట్లుగా ఆ ఊరిలోని ప్రతి కుటుంబం పునాదులతో సహా కదిలిపోయింది. ప్రతి మనిషి కదిలిపోయాడు.

ఆ దుమారంలో భయపడిన కొన్ని కుటుంబాలు తాటాకులవైపుకి పారిపోయాయి. గాలయ్య లాంటి కొందరు ఉద్యమకారులు రహస్య జీవితానికి వెళ్ళిపోయారు. చివరకు ఒక పాలేరుని కూలీని గౌరవించే సంప్రదాయం వచ్చింది.

మొగిలి వంటి ఉద్యమకారులు మాత్రం తన కుటుంబం ఆర్థికంగా వెనుకబడిపోతుందని తల్లిదండ్రులు చెప్పినా లెక్క చేయకుండా అనుక్షణం ఉద్యమాల కోసం ఆలోచించే వ్యక్తి. తన తల్లి తిడుతున్నా, తన భార్య మాత్రం మౌనంగా ఆమె అంగీకారాన్ని భర్తకు అనుగుణంగా వ్యక్తం చేసిన పోరాటస్వభావం గల యువతి. మొగిలికి అన్నలాంటివాడైన లక్ష్మీనారాయణ మాటల ద్వారా మొగిలిని మార్చాలని ప్రయత్నం చేసిన తల్లికి చివరకు నిరాశే మిగులుతుంది. లక్ష్మీనారాయణ కూడా పరోక్షంగా తమ్ముని సమర్థిస్తూ... "వాడూ అన్ని ఆలోచించే వ్యక్తే" అనే మాటల ద్వారా స్పష్టమవుతుంది.

ఒక్కడు పస్తేసి నలుగుర్ని బ్రతికించే మొగిలి అలాంటి మరో నలుగురి కోసం ఒక తిరుగుబాటుదారునిగా ఉద్యమకారునిగా కర్తవ్యాన్ని ఉదృతం చేస్తూ పోవడం "తుఫాను"కథలో కనిపిస్తుంది.

ధనికులు భూస్వాములు పేదవాళ్లని మోసం చేస్తుంటే, ఉన్నవాడు కాకపోయినా, లేనివానిగా బ్రతకలేక, ఉన్నవాళ్ళ పంచనజేరి లేనివారి జీవితాలతో ఆటలాడుకునే టక్కరి "సత్యనారాయణ". తమ హక్కుల కోసం తమ లాంటి నల్గురి జీవితాల్ని ఉద్ధరించేందుకు పోరాడే "లక్ష్మీరాజం" వంటి ఉద్యమకారుల ఆచూకీ తెల్పి అతని చావుకు కారణమై, నేడు ఉన్నవాళ్ళ మోచేతి నీళ్ళు త్రాగి, అయినవాళ్ళతో (భార్యతో) అసహ్యించబడే వ్యక్తి ఈ సత్యనారాయణ. ఆమె మొదటి భర్త అయిన లక్ష్మీరాజ్యం గురించి తెలియక అతనికి దూరమైనందుకు బాధపడింది "నీల".

"నన్ను చెడ్డోనిగా చూడకు నీలా! నన్ను నీ కట్టంలో మతికుంచుకో! నన్ను మతికుంచుకోవడమంటే - మేం దేనికోసం కొట్లాడుతున్నామో దాన్ని తెలుసుకోవడం. కష్టాలను సహించి ఊకోవద్దు. కొట్లాడాలే.... నువ్వు ఒంటరివి కావు నీలా!" అనే లక్ష్మీరాజం మాటలకు ప్రభావితమైంది. పలువురి సౌఖ్యం కోసం తన సుఖానికి దూరమైన లక్ష్మీరాజం వంటి వ్యక్తుల్ని ఆదర్శంగా తీసుకొని తన కొడుకుని ఈ సమాజంలో మరో లక్ష్మీరాజాన్ని తయారు చేయాలనే స్ఫూర్తిని కల్గజేసింది.

లక్ష్మీరాజం మరణించాడు అని తెలియగానే "నీల" ఆ ఉద్దేశంతో కాకున్నా, అప్పుడు తానున్న పరిస్థితి (బహిష్టు)లో ఒంటరిగా ఉన్నందున, సంప్రదాయం కోసం బావిలోంచి నీళ్ళు తోడుకొని తలమీద పోసుకోవడం చూసి అత్త "మిండెడు సచ్చిండని తలోర తానం చేసినాలే రంకు ముండ" అనే మాటకి అంతవరకు అత్త మాటకు ఎదురు చెప్పే ధైర్యం లేని "నీల" అప్పుడు "ఔ.... మొదటి మొగుడు సచ్చిండని" చెప్పిన సమాధానం ఆమెలోని తిరుగుబాటు తత్వాన్ని స్ఫురింపజేస్తుంది. ఉన్న వాళ్ళ సొమ్ముతో తాగొచ్చి తన భర్త తన్నినా చేసినా ఏమీ అనక, విసిగి వేసారి అలాంటి వాన్ని చంపినా పాపం లేదు. అనే స్థాయికి ఆమె సహనం నశించి పోవడం వల్లనే, అలాంటి వారిపైకి తన నెత్తురు పంచుకొని, తన కడుపు చీల్చుకొని పుట్టిన చిన్నారి కొడుకును "భర్తలా, తన తండ్రిలా కాకుండా" ఒక లక్ష్మీరాజంలా తయారు చేయాలనే ఆలోచన ఆమెలో కల్గుతుంది. నిజంగా "నీల" ఉద్యమాల ముద్దుబిడ్డల్ని కన్న తల్లి. ఇది "నీల" కథలో కనిపిస్తుంది.

భర్తని పిల్లల్ని వదిలి తల్లిలా పెంచిన తన తమ్ముని కాపాడుకునేందుకు అక్క చేసే ప్రయత్నమిది. పల్లెటూర్లో ఉంటూ అమ్మ చిన్నతనంలోనే పోతే తండ్రితోపాటు వ్యవసాయం చేస్తూ, తమ్ముని కన్న కొడుకులా, పెంచుతూ వాడికేమన్నా అయితే భరించలేనిది. ఇప్పుడు పట్నంలో తమ్ముని గురించి తెలుసుకునేందుకు ఉద్యమాల్లో తిరుగుతూ కాలరీ ప్రాంతాల్లో సమ్మెలు, లాకౌట్లు, ధర్నాలు, ఊరేగింపులు, అరెస్టులు, కాల్పులు వంటి వివరాల్ని కేవలం తమ్ముని కోసం

ఆరాతీసేందుకు ఆమె దినపత్రిక ఇంటికి తెప్పించుకునేది. ఇలాంటి గొడవల్లో వాని హృదయం లీనమైందని గడగడలాడిపోయేది. సుజాత భర్త మధుసూధన్‌కి మాత్రం ఆమె తమ్ముడంటే గిట్టదు. బావ మాటంటే లెక్కచేయక, అతడు ఉంచిన పనిలో స్థిరపడకపోవడం వలన, ఉద్యమాలవైపు మొగ్గుచూపడం. కాలరీలోని మధుసూదన్ వంటి అధికార్ల పట్ల కార్మికులకు తీవ్ర వ్యతిరేకత ఏర్పడింది. అట్లాంటి కార్మికుల్లో సుజాత తమ్ముడా ఒకడు కావడం మధుసూధన్‌కి నచ్చలేదు. మధుసూధన్ ఉంచిన ఏ ఉద్యోగంలోను అతడు ఇమడలేదు. అంటే అణచివేతను, అధికారం చెలాయించే వారిని ధిక్కరించే మనస్తత్వం అతనిలో తల్లిలాంటి అక్క చేతి పోతపాల ద్వారా వచ్చింది. ఎందుకంటే అతని అక్క కూడా ఉద్యమాల పట్ల ప్రభావితురాలైన స్త్రీ.

తమ్ముడు చదువుచున్న పుస్తకాల గురించి తెలిసి కూడా వాడు స్వతంత్రంగా ప్రవర్తిస్తున్నాడు, వాడు మాత్రం చెడిపోవడం లేదు. వానిలో వేయిమంది మంచి మనుషుల సంస్కారం జీర్ణించుకున్నట్లు కనిపించేది. వాడు అప్పుడప్పుడు ఏదో సిగ్గుపడుతున్నట్లుగా ఏవో పుస్తకాలు దాస్తూ తెచ్చి అక్కకు ఇచ్చేవాడు. స్వార్థపు ఆలోచనలు గల్గిన మనుషులకు మూలమెక్కడో ఆమెకు అర్థమయ్యేది. "తమ్ముడు ఇలాంటి నిప్పుల దారి ఎందుకు ఎంచుకున్నాడో?" అని అనుకునేది. తనకు తెలియకుండా తాను కూడా ఆ దారిలో నడుస్తున్నట్లు తెలిసి ఉలిక్కిపడేది.

దారి వెంట నడుస్తున్న సుజాతకు భూముల్లో పాతిన ఎర్రజెండాల్లో తమ్ముని ముఖం, చెయ్యెత్తి అవినీతిపై తిరుగుబాటు చేస్తున్నట్లు కనిపిస్తోంది. తాను వార్తా పత్రికల్లో చదివిన ఆ భూముల చరిత్రంతా జ్ఞాపకం వస్తుంది. ఉవ్వెత్తున ఎగిసిపడే సభలు - రైతుల పోరాట కెరటాల మధ్య ఆమె వార్తా పత్రికల్లో తమ్ముని పోల్చుకుంటుంది. నిత్యం అన్యాయం మీద వాడు చేసే పోరాటం కనిపిస్తుంది. తమ్ముడు సమాజంలో మార్పునాశించాడు. అయినా వాడీ జనంలో ఎట్లా ఇమిడి పోయాడు.?

తన తల్లి చనిపోతే తమ్ముణ్ని భుజాన వేసుకొని పాలకోసం మాదిగిండ్లకు పోయేది. చిఱతకింది రాజవ్వ. రోజూ తమ్మునికి పాలిచ్చేది. అంటే వారి మధ్య వారికే తెలియని సంబంధం ఏర్పడింది. అందుకే తన తమ్ముడు హృదయాన్ని తప్పక ఆ మాదిగ వాడలో దాచి ఉంచాడనే నమ్మకం కల్గింది. రవ్వంత ఆశతో ఆమె మాదిగ గూడెం వైపు బయల్దేరింది. భార్యకోసం వెదుకుతూ ఆచూకీ తెల్సిన మధుసూధన్‌కి ఆ వాడవైపు నడిచేందుకు అతని పెల్ల కాళ్ళకడ్డం పడుతూంది. అందుకే అతడు నడవలేక మెల్లగా నడుస్తున్నాడు. అతడు వెళ్ళేసరికి సుజాత రాజవ్వను పట్టుకొని ఏడ్వడం కనిపిస్తుంది. అక్కడి విషయం మధుసూధన్‌కి అర్థమవుతుంది.

తమ్ముని పట్ల అభిమానం. వాడు ఉద్యమ భావాలతో వాటికే అంకితమైతే, సుజాత వాడు చదివే పుస్తకాల ద్వారా వాని ప్రవర్తన ద్వారా ఉద్యమాలపట్ల ప్రభావితురాలై తమ్ముని సమర్థించే ఆమె మనస్తత్వం గూర్చి ఆలోచిస్తే ఆమెలో పోరాట భావాలు, ఉద్యమ బీజాలు ఏ మేరకు నాటుకున్నాయో అనే విషయం "జాడ" కథలో విశదమవుతుంది.

అన్యాయాన్ని వ్యతిరేకించాలనే తిరుగుబాటు స్వభావం ఉన్నా ప్రత్యక్షంగా ఎదిరించే ధైర్యం లేని అమాయకులు వారికి వచ్చిన అవకాశాల్ని ఆసరాగా చేసుకొని "నిరసన" తెల్పడం కనిపిస్తుంది. లచ్చయ్య నక్సలైటుగా చెలామణీ అయి ఉద్యమాల్లో తిరిగినంత కాలం వాన్ని ఏమీ చేయలేని పోలీసులు, అతడు జనజీవన స్రవంతిలో కలిసి జీవిస్తుంటే అతన్ని కాల్చి చంపేశారనే విషయం అతని తండ్రి మాటల వల్ల తెలుస్తుంది.

"ఒరే పోలీసు బాడకావుల్లారా! నా బిడ్డని చంపినార్రా'

.

"నా బిడ్డ అన్నల్లో తిరిగినన్నాళ్ళు వాని ముందుకైనా వచ్చినార్రా దమ్ములేని నాయాల్లారా!".

"నా బిడ్డ రిపోర్టు చేయడానికొస్తే కాల్చి సంపుతార్రా'?

"బుద్ధిగానం లేని నా కొడకల్లార..."

అని వాళ్ళ మీద విరుచుకపడితే పోలీసులు బూటుకాలుతో లచ్చయ్య తండ్రిని త్రొక్కే దృశ్యం చూసి

అక్కడున్న పదేళ్ళ పోరడు "అవ్వ! ఏం కొడుతున్నర్రా నీ యవ్వ ఒక్కొక్కని తెగనరకాలె" అనే మాటల్లోని ఉద్వేగాన్ని బట్టి చూస్తే వానిలోని తిరుగుబాటుతత్త్వం, ఆ పోలీసులు చేస్తుంది ఎంత అరాచకమో అర్థమవుతుంది.

బందు రోజు గ్రౌండులో క్రికెట్ ఆడే పిల్లల వైపు వచ్చే పోలీసు వ్యాను చూసి పిల్లలు పారిపోతుంటే అందులో ఒకడు "వస్తే మనకేంది" అన్న పిల్లవాని మాటలు విని కొట్టుకుంటూ వాన్ని జీపెక్కియ్యడం వంటి అగాయిత్యం, అధికారుల ఆగడాలు అధికారం ఉన్నదనే గర్వం, అలా చేయడం అన్యాయం అని ఎవడైనా అంటే వాన్ని అంతమొందించడం వంటి విషయాలు శంకర్‌ని బాగా బాధపెడ్తాయి. ఛాయ్ బంకు వద్ద ఓదేలు పోలీసులు మీద ఉన్న కసితో వారికి మంచిగా లేని టీ పోసి "నిరసన" తెలియజేస్తే అది అదునుగా "అవ్ లంజకొడుకులకు మంచిగయ్యింది" అని కుత కుత ఉడికే ఛాయ్‌లా మరిగే తన ఆవేశాన్ని ఆ మాటల ద్వారా వ్యక్తం చేసి తన "నిరసన" తెలుపుతూ కసి సైకిల్ పైడిల్ మీద చూపుతూ సర్రున వెళ్తాడు శంకర్. ఈ విధంగా "నిరసన" కథలో ఎవరికొచ్చిన అవకాశం ద్వారా వారు ఉద్యమాల ప్రభావానికి ఉన్ముఖులై దాన్ని బహిర్గతం చేయలేక అంతరంగికంగా నిర్వర్తిస్తున్నట్లు కనిపిస్తుంది.

కాలరీ యాజమాన్యం యొక్క ఆగడాలను నిరంతరం ఎదుర్కొంటూ కార్మికుల కోసం, కార్మికుల ఐక్యతను కాపాడుతూ వచ్చిన నర్సన్న లాంటి వారి హత్యానంతరం కార్మికుల్లో ఐక్యత దెబ్బతినడం, యాజమాన్యం యొక్క అవినీతి పెచ్చుమీరడం వంటివి. కార్మికుల హక్కుల కోసం సమ్మె చేస్తున్నప్పుడు ఆ సమ్మెకు కారణమైన వ్యక్తుల్ని తొలగిస్తున్నట్లు డిస్మిసల్ చార్జిషీటు నోటీసు బోర్డులో అంటించడం, సమ్మెను నిర్వీర్యం చేయాలనుకునే యాజమాన్యపు పోకడలు సమ్మిరెడ్డి లాంటి విప్లవ భావాలు గల నిష్పక్షపాత కార్మికుల్ని ఎంతగానో నొచ్చుకునేలా చేసినవి. కార్మికుల ఐక్యత పునరుద్ధరణ కోసం మనస్సులో మదన పడుతూ దాన్ని బహిర్గతం చేయలేక కాలుగాలిన పిల్లలా తన తోడైన మల్లేశం కోసం తిర్గుతూ... తోటి కార్మికులు తమకేమి పట్టనట్లు చెట్ల క్రింద చేరి పాడుతూ కేరింతలు కొట్టడం వంటివి వారిలో మార్పుని ఆశించిన సమ్మిరెడ్డి మల్లేశు లాంటి ఉద్యమ స్ఫూర్తి వారిని బాధపడేలా చేసింది. సర్కిల్, ఎమ్మెల్యే వచ్చి సమస్య పరిష్కరిస్తారనుకుంటే వారు కూడా యాజమాన్యం చేతిలో కీలుబొమ్మలై వెన్ను చూపుతారు. ఇక వారి సమస్య సమ్మెలతో, ధర్నాలతో పరిష్కారం కాదనే నిర్ణయానికి వచ్చి విప్లవ పంథాలో తిరుగుబాటు మార్గంలో దానిని పరిష్కరించుకుందాం - అనే ధోరణిలో రాత్రికి రాత్రే ఎవరికీ తెలియకుండా కాలరీ గని దగ్గర కార్మికులను, యాజమాన్యాన్నీ ఆశ్చర్యపరుస్తూ అన్నలతో వేయబడిన పోస్టర్ కనబడింది. కార్మికుల్లో ఉత్సాహం పెరిగింది. చివరికి ఆ పోస్టర్ వేసింది మల్లేశేనని సమ్మిరెడ్డికి మాత్రమే తెలిసింది. "కార్మిక సంక్షేమం కోసం నిష్పక్షపాతంతో సృజనాత్మకంగా ఆలోచించే ప్రతి ఒక్కరూ అన్నే" అనే విషయం "వాల్ పోస్టర్" కథలో వ్యక్తమవుతుంది. సమ్మిరెడ్డి మల్లేశులను ఏదో ఉద్వేగం వెంటాడుతున్నా అది తప్పు చేశామని కాదు. సక్రమమైన మార్గంలో సమస్యను పరిష్కరించు కుంటున్నాం. పోరాడుతున్నాం అనే భావన కనిపిస్తుంది. ఒక ఉద్యమాన్ని అడ్డుపెట్టుకొని అవినీతిని అధికార్లని ఎదిరించడం అనేది "వాల్‌పోస్టర్" కథలో తేటతెల్లమవుతుంది.

ఈ విధంగా "శ్వేతరాత్రులు"లోని కథలను పరిశీలించినట్లయితే వర్గ పోరాటం ముఖ్యంగా కనిపిస్తుంది. దీన్ని ఎదుర్కోవడానికి ఉద్యమాల సహకారం ఎంతవరకు తోడ్పడింది అనే విషయం సమగ్రంగా వ్యక్తమవుతుంది. ఆధునిక తెలుగు కథల్లో "శ్వేతరాత్రులు" కథా సంకలనానికి చారిత్రాత్మకమైన స్థానం ఉంది. ఒక ప్రజా ఉద్యమాన్ని ప్రజల భాషలో కథల రూపంగా వ్యక్తీకరించడంలో ఈ సంకలనం విజయం సాధించింది అని చెప్పడంలో అతిశయోక్తి లేదు.



# రామ బాణము

## చతుర్థీశ సర్గము

- ఊట్ల కొండయ్య

నాటి రేయి యయోధ్యాజనముల కెల్ల
నొక్కటే కలగా నిద్ర పిక్కటిలగ
తలపు లానందమున నివ్వటిలగ లేచి
వేగునన్ వచ్చి చేరిరి వీధులందు.

ఆ నగరవాసు లెల్లరు నంతనంత
వచ్చి కూర్చుండి రా రచ్చపట్టులందు
రాతిరంతయు విడక దర్శన మొసంగి
చనిన తాపసు మాట ముచ్చటలపడిరి.

అప్పుడెవ్వరినో నవ్వునరసినట్లు
మొరుగుచున్ పర్వ్యముందుకు, మరలివచ్చి
తోకలూపుచు పరిచితుల్ తోచినట్లు
వేపు లా జనానీకము వెరగుపడగ.

వేగుజుక్క జూచి సరయు వెల్లికేగి
యెవరొ తాళప్రమాణు డయ్యేరు దాటు
నట్టి భ్రమ కల్గి ధావకుల్ పిట్టలవలె
వచ్చి పడిరి రచ్చల భయభ్రాంతులగుచు

ఎదొ తెరవెన్క నున్నయటు
లెద్దియొ పుణ్యము చేరవచ్చు
టైదియొ శుభమ్ము రెక్కలు
ధరించి వడిన్ చనుదెంచునట్టు లె
య్యదియొ మహానుభూతి
హృదయమ్ముల నిండగ రచ్చలోని వా
రెదలు దిటమ్ము జేసికొని
యిట్టనువారయి రూహపోహలన్

ఏమి ప్రత్యూష మెగబోయుచున్నది
బ్రదుకు సేదలు దీర్చు పరిమళముల
నీ మేఘ తతిమింట నెవరి రూపమొ చూప
క్షణమున కొక్క వేషమ్ము కట్టు
నీ భూరుహసమూహ మెవరినో రమ్మను
నట్టులు తలలూపు నదిగొ చూడు
డీనాడు క్రొత్తగ నింటింట గోవులె
వ్వరినో పిలుచునట్టు లరచు వినుడు
రజక సోదరభ్రాంతియు గ్రామసింహ
విభ్రమమ్మెట్టిదో నేర్చు విధియెయనుచు
నోటి కొక మాటగా నటనుడువులాయె
పౌర్ణిమా శశాంకుడు రేయిపవలొనర్చ.

తలవరులంతంత జనా
వలులం బరికించు వారవాక్కులునై, మో
ములుపా గల చేలాంచల
ములగప్పికొనుచు విసవిస పోయిరి మరుగై.

పరచివచ్చెనప్పు డటకు తురగమొండు
కని జన సమూహ మాకస్మికముగ నాగె
ఫేనముఖ మెత్తి, ముంగాళ్ళ బిగియబట్టి
వేల కనియాగు నున్న యుద్వేగమనగ.

అటు హయ వాయు వేగగతి,
నాచ ఖలీనము రౌతు బిబగ్గ
ట్టుటయు కరద్వయమ్మున
పటుత్వముమై, జవనమ్మునున్ హుటా
హుటి శిలదాకి నింగిపయి
హోయని లేచు సముద్ర భంగమ

న్నటులుగ లేచె మీదికి
ప్రియంకర హేషల వెన్క కాళ్లపై 9

వెనుకాళ్ల కండరమ్ముల
పెనచి, తను స్నాయుశక్తి విలసనమున లే
చిన తత్తడి నాస్ఫోటన
ము నడించియు, తాను డిగ్గి, పురపాలుడనెన్. 10
భూజాగ్రమ్ముల పర్విడు
నే జనునేనియును కంటిరేనిన్, మీరే
యోజనయిన నియ్యెడలన్
రాజాజ్ఞగ వెల్లడింప ప్రజకున్ వలయున్ . 11

ఆన ప్రజ లట్టి దియ్యెడల
నారసినట్టు లెరుంగ మొండెడన్
కనుగొనిరేమొ చూడుమనగా
శిర మౌ నను నట్టులూపి, స
ద్రున నతడెక్కి యశ్వము
నారోహితుడాయె, దవానలమ్మనం
గను నగరమ్ము నల్కడల
క్రమ్మె తదీయ సువార్త లిప్తలో. 12

ఆశ్వికుడు నిర్గమించిన యంత నచట
నొక్క చతురుడు, హాస్య వక్రోక్తిపరుడు
నన్నునుం బల్క నిండొక్క చిన్నమాట
ననుచు నెల్లరు నవ్వంగ ననియెనిట్లు. 13

తరులపై నెవ్వరో పరచెనందురుకదా?
యవనీజముల నేల యడుగరయ్య?
మబ్బులెవ్వరివొ బొమ్మల జూపెనందురే
యాకసమ్మును దింపి యడుగ రేల?
సరయునంగంటి మంటిరి కదా తాళప్ర
మాణు నాతని పట్ట మానిరేల?
కలలయందెవ్వరో కానిపించిరి కదా
కలలనాతని మూట గట్టరేల

నాదు ప్రశ్నల విప్పు మానవుడెవండొ
వాని కీ మూడు లోకాలు వ్రాసియిత్తు
పురుషులుండిన నిందుల కరము లెత్తు
డాలసించిన బహుమాన మంతరించు

తలవ నితల పుగ నాతడు
పలుకుచునున్నట్టి చతుర భాషణములతో
గల గలమని నవ్వులు, నా
ర్పులు, కరతాళమ్ము లీలలున్ చెలరేగెన్

వెండియు నాతడిట్లునుడివెన్
జనులందరి స్వప్న సీమ నె
న్నండు నెరుంగనట్టు లొక
నాడె కనంబడి పోయినట్టి యు
ద్దండ మహర్షి యెట్లయిన
దర్శన మీక చనండనంగ నా
నిండు మనమ్ము చెప్పెడిని
నేర్చియొ నేరకొ స్ఫూర్తి మంతమై.

అమ్మని తపోబల మ్మెట్టి దగునొకాని
యతని సంకల్ప బలమెట్టి దగునొయేమొ
యతని నడిపెడి విధి యెట్టిదగునొ కాని
యిట్టి ఛాయ నంపు టెరుగ మేన్నడేని!

అప్పుడందుల ముదుసలియగు నొకండు
పలికెనిట్లు యోధ్యకు పట్టినట్టి
పోల్కి తోచుశుభమ్మొదో, పుత్రులార!
పూజసల్పుద మీహయమునకు లెండు

ఈనగవులకేమి గాని లేగ్లడలె
పాలు బిదుకపోవ వలదె రండు
ఈ హాస్యముల కేమిగాని తీర్థము తేర
కావడులు ధరించి పోవలె రండు
ఈ పరిహాసాలకేమి గాని శివాల
యము మనకై యెదు రరయుచుండు

ఈ వినోదమ్ములకేమి గాని ఘణంఘ
ణలమ్రోయు కోట గంటల వినుండు

మ్రతిలో నిద్ర మేల్కని మాటలాడు
నొక్కటే రొదగ నదిగొ రిక్కగములు
భుజ కలశముల తోడ బావులకు వెడలు
గేహినీ జనము నవలోకింప వలదె? 19

కలలో వచ్చి య యోధ్యా
స్థలి మెట్ట కపోడు లెండెతండును, తాను
యిల కిరువగు మన పత్తన
తల సంస్పర్శనము వలన ధన్యుడుకాడో ? 20

కనుగొనుండదెయిల్లాంద్రు కసవులూడ్చి
చల్ల దొడగిరి ముంగిళ్ల, తెల్లవార
జొచ్చె, కాల మీ గతి విత బుచ్చనేల?
రండు పోదము దినకర్మకాండ దీర్ప. 21

కల యెటులున్నను కర్మ కు
శలురగు మానవుల ఘర్మ జలజాతములన్
నిలచు కదా సిరియను ముదు
సలి పలుకులు ప్రజకు కర్మ సారధులాయెన్ 22

కులసతులు వాకిళుల ము
గ్గులు దీర్చుచు పతులబిలుచు కొనిరి నగుచు, స్వా
ములు కలలలోనే యింకను
కలరా, కనుదోయి తెరువ గలరా యనుచున్ 23

ఆ నగవులు రచ్చల ప్రతిధ్వాన మీన
పదుడు పదుడనుచును పరస్పరమునెచ్చ
రికలతో నెల్ల రిండ్లకు లేచి చనిరి
బాలురును వృద్ధు లనుసరింపంగవారు 24

ఇండ్లదారులలో దారలెదురువచ్చి
యిరవు తెరువుల మరచితిరేమొ యనుచు
పెట్టి గీముల తలుపులు వెదక వలసె
నుడుపులన చెవి కోసికొందురు కదయ్య! 25

విడిచె నారచ్చ? కలకిట్లు వెరగు పడెడు
మగలతో కాపురమ్మెట్టు లగునొయేమొ!
యను సతుల పొలయల్కలు వినయ చతుర
భాషణల హాసమగునట్లు పతులొనర్ప. 26

కోటన నూరు స్వాగత
నిగుంభిత సూక్త మహాస్వరమ్ములు
ద్ఘాటితమై చెలంగె వినతా
సుతుడా! రవిసుతుడా! జగ
న్నాటక సూత్రధారి! యరుణ
ప్రభు! రమ్మ''ని, దుందుభుల్ నిరా
ఘాటముగా దిశల్ ప్రిదులగా
గరుడాగ్రజు బిల్చె మ్రోయుచున్ 27

# (వడ్డించిన విస్తరి)

- డి.ఎ.ఎల్.ఎన్. మూర్తి

మాతృగర్భాన తొమ్మిది మాసములను
గడిపి ఇప్పుడె భూమిపై పడిన శిశువ!
ఏడుపును మాని కొంత గ్రహింపుమయ్యా
ప్రకృతి నీకెన్ని యిట సిద్ధపరచె నపుడె

ఏడుపువినిపించి నంతనె ఎగిరి గంతు
లిడిన రీతిని ఆనందపడెను తండ్రి

పురుటి నొప్పుల బాధలు మరచిపోయి
కనుల చెమరించి నిన్గాంచె కన్న తల్లి
అక్షయంబైన మధుర క్షీరామృతంబు
వేడ్కతో సిద్ధపరచెను విందొనర్ప

నిన్ను జూడంగ విచ్చేసి యున్నవార
లందరకు మిఠాయిలు తండ్రి అందజేసె
నీవు కూడను పెద్దవయి ఈవి కలిగి
అతిథి సత్కారములను చేయంగవలయు

స్నానపానాదులకు అనుష్టానములకు
స్వర్ణదీతల్లి స్వచ్ఛమౌ జలమొసంగె

ప్రాణముల్ నిలబెట్టెడు వాయువులను
మందమందంబుగా వీచె మారుతములు

విశ్వాంతరాళాల వెల్గు వేడినొసంగి
దృష్టి ప్రసాదించు దినకరుండు
చల్లని జ్యోతులన్నిట జగతిని నింపు ర
సాత్మకుండైనట్టి చందమామ
పంటలు ఖనిజ సంపదలతో సృష్టి కా
ధార భూతంబైన ధరణి మాత
ప్రాణవాయువు పూలు పండ్లు నీడ నొసంగు
రమణీయమగు వృక్ష రాజములును
ఔషధంబుల ఖనిజ హిమాలయంబు
తీర్థ జలముల నొసగు నదీనదాలు
ప్రాణి కోటికి వలసిన వస్తువులను
ఎల్ల సృష్టించి మనకిచ్చె నీశ్వరుండు

అర్భకా! నీకు వడ్డించి నట్టి విస్త
రెదురుగానుండె నైవేద్య మిడి భుజిం
మంచి చేసెదొ? విస్తరి చించి వేసి
ఏడ్చి ఏడ్పించెదో? ఇంక నీ ఇష్టమం

- రేగులపాటి కిషన్‌రావు

సజ్జనుడొక్కడు
పైసపాలుకొని
పసిపిల్లలకే ఇచ్చాడు .

ఆ సజ్జనుడే
పైసరొట్టెకొని
ఆకలి కడుపులు నింపాడు .

అదే సజ్జనుడు
పైస నీరు కొని
పదుగురి దాహం తీర్చాడు

దురాత్ముడొక్కడు
మూడు పైసలతో
తుపాకి ఒక్కటి కొన్నాడు
పదుగురి పాలు, రొట్టె గుంజుకొని
పొట్టలావుగా పెంచాడు

(మాధవరావు రేగులపాటి గారి హిందీ కవిత ఆధారంగా)

# పత్రికా విహంగము

- ఐతా చంద్రయ్య

చుట్టంలా తలుపుతట్టి
చురకలా మత్తు వదలిస్తుంది
నా కోసం రెక్కలు విప్పి
నెచ్చెలిలా ఒళ్ళో వాలుతుంది
మనసు గది గోడల్ని స్పృశిస్తూ
మరో లోకానికి నడిపిస్తుంది.
అండ, పిండ, బ్రహ్మాండాలను
ఎద పొదలో పొదుగుతుంది.
అనగాన తెరనిండా
రాజకీయ రంగుల చిత్రాలు అద్దుతుంది
ఊహా రేఖల బొమ్మరింటిలో
ఊసులాడుకుంటున్న ఉబలాటానికి
ఉత్తేజం రెక్కలు తొడిగేస్తుంది
నిజం విత్తనాల మురికిని
నిర్మోహమాటంగా కడిగేసి
ఆసక్తి పొలాల్లో అలికేస్తుంది
అపోహల కలుపు మొక్కల్ని
ఆధారం ముక్కుతో ఏరేస్తుంది.
వెలుగు చూడని ముడుపుల
ముడుల నడుమ
నలిగిపోతున్న "కుంభ" కోణాల అంచులదాకా
విహంగవీక్షణం విసిరేసి
కుండబద్ధలు కొట్టేస్తుంది.
పాతాళ హోమాల
ధూమకేతువుల జుట్లను
ప్రజల నాల్కలమీద ఆడిస్తుంది.
చిటికెడు ఆయుష్షుతో
అనంతాశయాంబర విహారం
ఆఖరు నిమిషం దాకా
అలసట కందని పోరాటం.

(గేయనాటిక)

హిందీమూలం
మైథిలీ శరణ గుప్త

తెలుగుసేత
చావలి రామచంద్రరావు ('సమతారావు')

భూమాత :
కమ్మనైన కడుపు మంట
కనుల పండువాయె కనగ
పుత్రగర్వ భాగ్యమునను
పూత చరితగా నొనర్చె
వింత ఏమో నా పుత్రుడు
ఇంత విశాలపువక్షం
ఆటలాడ చాలదనుచు
ఆవేదన పడసాగెను
స్థలము లందు జలము లందు
అంతులేని ఆకసమున
నిశ్శంకగ నిర్భీతిగ
తిరుగాడగ సాగినాడు
అంగారక వాసులతో
సరదాగా సంచరించ
గ్రహ లోకములన్నితిరుగ
తహ తహ పడసాగినాడు
ఆవిరి విద్యుత్తు లతని
అదుపులోని బంట్రోతులు
చంచలయగు లక్ష్మి సైత
మచంచలగ నిలిచె ముందు
రసాయనిక శక్తులతని
వశమున వర్తించసాగె
సిద్ధులతని బుద్ధికి
సిద్ధించసాగె సిద్ధముగా

ఇంతటి భౌతికపు ప్రగతి
ఇంత వరకు లేదు జగతి
ఉక్కు గుర్రములనెక్కిన
యంత్రతంత్ర పరు డాతడు
ఇంద్రజాలికుని పోలిక
ఇంపు గూర్చు పురుష వరుడు
నిత్య నూతనముగ సదా
సలుపుచుండు పరిశోధన
ఎంత ఘనుడు నా పుత్రుడు!
ఎంత ఘనత నా జన్మకు!
శక్తి పూజ సలిపి సలిపి
యుక్తులెన్నొ పన్ని పన్ని
సాధించెను మహాశక్తి
శాక్తేయుండైన వ్యక్తి
శక్తిపైని సాధించెను
సాటిలేని అధికారం
మతి మాత్రం వశము దప్పి
వక్రించెను బుద్ధి బలం
ప్రమాద పథ పథికు లెపుడు
చేరుదురా నిజలక్ష్యనం?
దుస్సాహస పథికుల నిక
రక్షించెడు వాడె యిల
రాముండొక్కరుడే గద!
శరణు శరణు శ్రీరామా
శరణంటిని బ్రోవరార!

*డిసెంబర్, 1995 - స్రవంతి*

నాడు సీతనర్పించిన
రీతిగ నాసంతు నిపుడు
నీకే యర్పించుచుంటి
నిన్నే నేనమ్ముకుంటి.
నా సంతతి భవిష్యత్తు
ఏమగునో అయోమయం
తలచుకుంటే హృది నదేమో
అంతులేని భయం! భయం!
అడుగడుగొ! వచ్చెసుతుడు;
ఎటకో పొనుండె నేడు!

**పృథ్వీపుత్రుడు :**
అమ్మా! అమ్మా! నిన్నేనమ్మా!
నూతనయాత్రకు పోతానమ్మా!

**పుడమి తల్లి**
వస్తివా నా కన్న వచ్చావుటయ్య!
చిన్నారి నా తండ్రి క్షణమాగవయ్యా!
చూడగా నీతీరు దిగులుపుడుతోంది
దయ్యమేదొ నిన్ను పట్టినట్లుంది
భూత దోషము నిన్ను బాధించకుండ
కాటు కెట్టెదరార నా కన్నతండ్రి!

**పృథ్వీ పుత్రుడు :**
ఎంత బేలవె నీవు వెర్రిమాయమ్మ!
ఈనాటి నా శక్తి గురుతించవమ్మ!
స్వీయ ప్రతిభను జూపి శోధనలు జరిపి
జరామృత్యువులనే తరిమివేస్తానె
ఇంత కొడుకును గన్న యింతివే నీవు
ఈ మాత్ర మెరుగనటె నా బుద్ధి లావు
ఆనాటి వలెనె మరియీనాడు గూడ
ఎప్పుడూ బాలుడటె నీ కొడుకు చూడ?

**పుడమి తల్లి :**
ఏమంటావుర యింతకు
వింతగ మాట్లాడుతావు
తల్లినన్న మాట నన్ను
మరువ మందువటరా మరి?
ఔనులేర నీవిప్పుడు
ఆకాశ విహారివాయె
అమ్మ తోడ పనిలేదులె,
అరిందా వైనావులె

**పృథ్వీ పుత్రుడు :**
అమ్మా! నా మాట నీవు
సాంతముగా వినవదేల?
అవగాహన చేసికొనకె
ఆగ్రహించు తా వదేల?
అర్థహీనమైన వ్యర్థ
ఆదిమయుగ సంస్కారం
అమ్మా! నిను నేటికినీ
వీడలేదు వింతగదా!
కాకుంటే యీయుగాన
ఏమిటి నీ భూత భయం!

**పుడమి తల్లి :**
నీదు మేధస్సుతో శ్రమియించి మించి
నీవు తెచ్చిన నేటి సంస్కారమంత
సాటి ఎరుగని మేటిశక్తియే గాక-
కాని ప్రళయాంతమున సాంతముగ నేనె
పాతాళమున క్రుంగి పతనమవననెడి
హామీలు లేవు గదరా వెర్రివాడ!
ఏరీతి చూచినా లేదు సందియము
బాలకుండవు నీవు బుద్ధిహీనుడవు
కాదందువా నీవు కనుదెరిచి చూచి

నిజము పలుకర బాబు నిలకడగతూచి
పోటీలు పడుచు మరి నేటికిని నీవు
ఏమిటీ గోలి గుండ్లాట లిటుచూడు!

**పృధ్వీపుత్రుడు :**
గొలిగుండ్లేనమ్మ గేలి చేస్తావు
గోళమె అమ్మ! నా చేతిలో ఉంది

**పుడమి తల్లి :**
గోలీ కాదనుకోలె గోళమేననుకో!
కాకున్నచో ఆటకందుకంబనుకో!

**పృధ్వీపుత్రుడు :**
నిను పోలినదెగదా తిలకించవమ్మ!
నీ రూపు కందుకము గదుటె మాయమ్మ!

**పుడమి తల్లి :**
చిలిపి మాటలు చిన్నారి తండ్రి!
ఏ ముందిరా యందు ఎరుగ జెప్పుముర!

**పృధ్వీపుత్రుడు :**
ఏమేమి గలవొ నీదివ్యగర్భమున
ఎరుక లేదెవ్వరికి యీలోకమందు
వినవమ్మ చెబుతాను నా గోళమందు
నాయొనర్చిన నూత్న సృష్టిగలదమ్మ!

**పుడమి తల్లి :**
ఏమంత కక్కుర్తి ముంచుకొచ్చెనుర?
నూత్న సృష్టికి నీవు తెగియించినావు

**పృధ్వీపుత్రుడు :**
అమ్మరో యీ నూత్న సృష్టిని
ఆటగా భావించగదవే!
ఆటలో యీ గోళ మొకపరి
గంతువేసినచాలు తెలుసా?
తిరుగులేదే నాదు విజయం
విశ్వ విజయుడనగుట ఖాయం

**పుడమి తల్లి :**
ఏమిటిర వదరెదవు ఏమేమొ కన్న!
ఇంతకు యిందు మరి ఏముందిరన్న!

**పృధ్వీపుత్రుడు :**
కాలానలమమ్మా యిది హాలాహలమమ్మా!
నా శత్రుల దహియించెడి దావానలమమ్మా!
ప్రతి పక్షులు ఎక్కడున్న హతమారెదరమ్మా;
తిరుగులేదు నా దెబ్బకు హరినే నేనమ్మా!
నీదు గర్భానున్న నిప్పు కొండల మించి
నూరురెట్లధికబంబె దీనిపాటవము!
శతకోటి ఏండ్ల పూర్వము నాడు నీవెట్టి
మంటల్లో మండితివొ మరపురా లేదు గద;
అట్టి దావానలము; అట్టి కాలానలము
నిండియున్నదె యిందు నిక్కమోయమ్మ!
ఉలికిపడి నా వేలనమ్మా!
వణకు చుంటి వదేలనమ్మా!
నాటి దృశ్యం కనులముందే
నాట్యమాడిందా?

*(సశేషం)*

# మందార మాల

## 'ప్రసన్నకవి' శంకరంబాడి సుందరాచారి

మా తెలుగు తల్లికీ మల్లె పూ దండ
మా కన్న తల్లికీ మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి ....

అన్నపై దేశభక్తి గేయాన్ని తెలియని తెలుగువారుండరు అంటే అతిశయోక్తి కాదేమో! ఈ గేయాన్ని రచించిన కవి శ్రీ శంకరంబాడి సుందరాచారి అని బహుకొద్ది మందికే తెలుసు. రవీంద్రుని దేశభక్తి గీతం తరువాత అంతటి ప్రజాదరణ పొందిన గేయం 'మా తెలుగు తల్లికీ మల్లెపూదండ' తెలుగువారి అనధికార జాతీయగీతంగా ప్రసిద్ధి చెందింది.

శ్రీ శంకరంబాడి సుందరాచారిగారు కలియుగ వైకుంఠం అయిన తిరుపతి పుణ్యక్షేత్రంలో కమలమ్మ, రాజగోపాలయ్య దంపతుల పంటగా 1914 ఆగష్టు 10వ తేదీన జన్మించారు. సుందరాచారిగారు తిరుపతి దేవస్థానం హైస్కూలులో చదివిన అనంతరం ఇంటర్మీడియట్‌ను మదనపల్లిలోని బీసెంట్ థియోసాఫికల్ కాలేజీలో పూర్తి చేశారు.

మద్రాసులోని 'ఆంధ్రపత్రిక' కార్యాలయంలో వీరు సహాయ సంపాదకులుగా పని చేశారు. వీరు 11 నాటకాలు రాశారు. చిత్తూరు జిల్లా బోర్డ్ హైస్కూలులో సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయులుగా పని చేశారు. 1951 నుండి 1954 వరకు వీరు కడప, చిత్తూరు జిల్లాలో స్కూళ్ల డిప్యూటీ ఇన్‌స్పెక్టర్‌గా పని చేశారు. ఆత్మాభిమానంగల వీరు ఈ పదవిలో ఎక్కువ కాలం కొనసాగలేదు.

'సహజకవి' అయిన శ్రీ శంకరంబాడి సుందరాచారి 'దీనబంధు' అనే చిత్రానికి పాటలు రాశారు. ఇదే సమయంలో వీరు 'మా తెలుగు తల్లికి' గేయం రాశారు. ఈ గేయాన్ని ప్రసిద్ధ నటీమణి, గాయని టంగుటూరి సూర్యకుమారిగారు గ్రామ్‌ఫోన్‌లో పాడి ఈ పాటకు విస్తృతమైన ప్రచారాన్ని కల్పించారు.

విద్యార్థులలో కావ్యపఠనాభిలాషను పెంపొందించే విధంగా వీరు ఎన్నో కావ్యాలను రచించారు. గేయ సంపుటాలు, బుర్రకథలు, ఖండ కావ్యాల రూపంలో వీరి కవితాయాత్ర సాగింది. వీరు తన కవిత్వంలో ఎక్కువగా 'తేటగీతి' పద్యాలను వాడి తేట తెలుగులోని తేనె మాధుర్యాన్ని తేటగీతుల్లో చవి చూపించారు.

'జపమాల', 'బుద్ధగీతి', 'శాంతి దూతలు', 'ఏకలవ్యుడు', 'అపవాదు', 'అగ్ని పరీక్ష', 'సుందర సుధాబిందువులు', 'సుందర రామాయణం', 'సుందర భారతం', 'శ్రీనివాస శతకం' మొదలైన కావ్యాలు రచించారు. రవీంద్రనాథ్ ఠాకూర్ 'గీతాంజలి'ని అనువదించారు. అనేక వ్యాసాలను రచించిన వీరు నటనలో కూడా మంచి పేరు సంపాదించుకున్నారు.

'జపమాల' గేయ సంపుటి. గాంధీజీ, బుద్ధుల జీవిత చరిత్రలను బుర్రకథల రూపంలో 'శాంతి దూతలు' అనే కావ్యంలో రచించారు. ఈ కావ్యాన్ని గాంధీజీకి అంకితం ఇచ్చారు.

'బుద్ధుని జీవితాన్ని 'బుద్ధగీత' పేరుతో 3 భాగాలుగా 'పూవు, కాయ, పండు' దశలుగా వర్ణిస్తూ 148 తేటగీతి పద్యాలతో రచించారు. మొదటి భాగంలో సిద్ధార్థుని జననం, రెండవ భాగంలో సిద్ధార్థుడు గృహాన్ని విడిచి వెళ్ళడం మూడవ భాగంలో సిద్ధార్థుడు బుద్ధుడుగా మారి 'అహింసా పరమో ధర్మః' అని బోధనలు చేయడాన్ని వర్ణించడం జరిగింది.

"బుద్ధి మొలచెను సిద్ధార్థు బుజ్జలోన,
బుద్ధుడయ్యెను లోక ప్రసిద్ధుడయ్యెను"

అని 'బుద్ధగీతి'లో సిద్ధార్థుడు బుద్ధుడుగా మారిన వైనాన్ని చక్కగా సులభశైలిలో రచించారు. 'బుద్ధగీత'ను వీరు అనర్గళంగా, మధుర గానంతో పాఠశాలల్లో కావ్యగానం చేస్తూ విద్యార్థులను ఆకట్టుకున్నారు.

'ఏకలవ్యుడు' అనే గ్రంథంలో ఏకలవ్యుని కథను రచించారు. ఏకలవ్యుడు ద్రోణునకు గురుదక్షిణగా బొటనవ్రేలు ఇవ్వడం ఈ గ్రంథంలో చక్కగా వర్ణించారు. ఇందు అలతి అలతి పదాలతో సులభశైలితో, తెలుగు పలుకుబడులు పొంగులు వారే విధంగా రచించారు.

ద్రోణుడు ఏకలవ్యునికి రహస్యంగా విలువిద్యలు నేర్పించినాడని అర్జునుడు ఈర్ష్యతో ద్రోణుని తూలనాడుట తగదని, ద్రోణుడు ఏ పాప మెరుగడని, పంచప్రాణాలు నీ యందే నిలపినారని, శిరము వంచి నిలిచాను నన్ను కసితీరా తరిగి తరిగి ముక్కలు చేసి నక్కలకు విసిరివేయమంటాడు. ఏకలవ్యుడు. అంతేగాదు రాజ్యాలు శత్రువులు లేని మాకు విలువిద్యలు అవసరం లేదంటాడు.

'లేవు రాజ్యాలు, శత్రువులు లేరు మాకు
నేసలను నొడ్డి చెండాడు చింతలేదు -
ఎందులకు మాకు విలువిద్యలందు నేర్పు?
గువ్వలేసె బోయకు గుణము చాలు.'

గువ్వలు వేటాడే బోయవానికి విలువిద్యలు అవసరం లేదనీ, గుణముంటే చాలునని ఒక బోయవాని చేత రచయిత అనిపిస్తూ, బోయవాని గుణాన్ని కీర్తి శిఖరాలకు ఎత్తారు. కులము కన్న గుణము మిన్న అనే సత్యాన్ని తెలియజేశారు. కులాల కుమ్ములాటలో జాతిని, దేశాన్ని భ్రష్టు పట్టిస్తున్న నేటి సమాజానికి ఇలాంటి సందేశం ఎంతో అవసరం.

'బుద్ధగీత', 'ఏకలవ్యుడు' రచనల అనంతరం 'అపవాదు' కావ్యాన్ని తేటగీతిలో రచించారు. ఇందు 'ఆజ్ఞ, ఆచరణము, అవనీ ప్రవేశము' అను మూడు భాగములు ఉన్నాయి. శ్రీరామ పట్టాభిషేకానంతరం సీత గర్భవతి అని తెలిసి రాముడు సీతను ఏమైనా కోరికలు ఉంటే తెలియజేయవలసిందిగా కోరుతాడు. రాముడంతటి వానికి రాణినై, పొందువీడక కొలిచిన పుణ్యం తనకు అబ్బినదని, నీ అండచాలు అంటూ కల్పవృక్షం నీడలో కాసులు కోరనంటూ సీత అడవులకు మరల ఒకసారి పయనించి మునులకు మ్రొక్కి రావలెననే కోరిక వెలిబుచ్చుతుంది. అపుడు రాముడు అడవులలో నాతో కలిసి పడిన కష్టాలు చాలవా అంటూ-

'వస్తువులు, వాహనంబులు, వలయు సిరులు
పట్లు పుట్లాలు, భూషలు వలయునంచు
వేడు కామినులున్నారు విశ్వమందు
కానలను గోరి పయనించు కాంతలరుదు.'

అని స్త్రీల కోరికలను తెలుపుతూ అడవులకు పయనించు కాంతలు అరుదని అంటారు. ఇక్కడ సీతారాముల ఎడబాటును ముందుగానే పాఠకులకు తెలియచేయడమేగాక, అడవుల్లో తపస్సు చేసుకునే మునులపై సీతకు గల భక్తి ప్రపత్తులు తెలియజేస్తున్నారు కవి.

ప్రజల పలుకు ఆదరించని ప్రభువు, ప్రభువుకాడని రాముడు తలచి లోకం వేసిన 'అపవాదు'కు జడిసి రాముడు సీతను అడవిలో వదలుమనుటను 'ఆజ్ఞ'లో రచయిత తెలిపారు. 'ఆచరణము'లో లక్ష్మణుడు సీతాదేవిని గంగానదీ ఒడ్డున విడుచుటను, 'అవనీ ప్రవేశము'లో వాల్మీకి మహర్షి సీతను గంగానదీ ఒడ్డు నుంచి తన ఆశ్రమమునకు తీసుకొని వెళ్ళుట, లవకుశల జననం, లవకుశులు శ్రీరామచంద్రుని గాథను గానం చేయడం, సీత తన తల్లి భూదేవిని ప్రార్థించి తల్లిలో లీనమైన పైనం ఈ భాగంలో కడురమ్యంగా హృద్యంగా వర్ణించారు. సీతారాముల ఎడబాటు సుందర గంభీరంగా, పారవశ్యంతో చదువుకొనే విధంగా రచించారు శంకరంబాడి సందరాచారిగారు.

'అగ్నిపరీక్ష' అను ఖండకావ్యంలో ఆర్య సంప్రదాయమును పాటిస్తూ, నిత్యాగ్నిహోత్రుడు, హైందవ ధర్మవ్రతుడగు హరిహరుడనే వేద బ్రాహ్మణుని కుమార్తె అయిన శాంత అనే ముగ్ధను ఐశ్వర్యవంతుడు, ఆదర్శభావాలుగల శ్రీధరుడు అనే యువకుడు వివాహమాడుతాడు. శ్రీధరుడు శాంతకు ఆంగ్లభాషతో పాటు నవనాగరికతలు నేర్పి సమాజంలో ఉన్నత స్థాయి కల్పిస్తాడు. పరపురుష వ్యామోహంలో పడి శాంత చివరకు భర్తనే వీడి పరపురుషుని పొందు కోసం పరితపిస్తుంది. ఈ వైనాన్ని ఒక చక్కటి తేటగీతి పద్యం ద్వారా వర్ణించారు శ్రీ శంకరంబాడి.

'ప్రాతరీతులు వీడి నవ్య పద్ధతులకు
బాగ నలవడి స్వేచ్ఛానువర్తినియయి
వసుధ మెలగుట చాలక పతినె వదలి
పరపురుషు గోరు దౌర్భాగ్యవతిగ మాఱె'

ఇందు మనోహరుడు అనే చిత్రకారునికి తన ఇంట్లో స్థానం కల్పించి, భర్తకు తెలియకుండా ఒకనాటి రాత్రి ఆ

చిత్రకారునితో వెళ్ళిపోతుంది శాంత. మనోహరుడు, శాంత కాపురం సాగిస్తున్న సమయంలో ఇంటికి అతని మిత్రుడు వస్తాడు. శాంత అతనికి 'తేనీరు' ఇస్తుంది. ఈ విషయాన్ని చూచి అనుమానించిన మనోహరుడు, ఆగ్రహించి 'పతుల మార్చు పచ్చి లంజెవు నీవు' అని ఆ రాత్రి శాంతను ఇంటి నుంచి వెళ్ళగొడతాడు. తన తల్లిదండ్రులను గాని, శ్రీధరునిగాని చేరే ధైర్యంలేక శాంత భావిలో దూకుతుంది.

'అతివలకు స్వేచ్ఛ నెపుడు నీయకుడు మంచి
యసుభవమ్ముస జెప్పెద నందఅకు'

అని తలచుచు ఆ బావి గట్టు సమీపంలో ఉన్న శ్రీధరుడు బావిలో యువతి దూకిన విషయాన్ని పసిగట్టి ఆమెను రక్షిస్తాడు. ఇరువురు ఒకరినొకరు గుర్తించుకొంటారు. చివరకు శాంత 'పరుని చేబడి చెడితినే బ్రతుక నింక' అంటూ ప్రాణాలు విడుస్తుంది. ఇందులో స్త్రీకి స్వేచ్ఛ అవసరమనీ, ఆ స్వేచ్ఛను హద్దులు దాటకుండా అనుభవించాలనే సత్యాన్ని రచయిత తెలియజేస్తున్నారు. అంతేగాక హద్దు మీరిన స్వేచ్ఛ వలన కలిగే అనర్థాలు కూడ ఇందు మనం గ్రహించవచ్చు.

'సుందర సుధాబిందువులు' సుందరమైన ఖండకావ్యం. ఇందులో రెండు భాగాలున్నాయి. మొదటి భాగంలో శ్రీ వెంకటేశ్వరస్వామిని 'నాస్వామి' గేయం ద్వారా స్తుతించారు. కూరలను అమ్మే వైనం తెలియజేశారు 'కూరాకుపడుచు' గేయంలో. 'నిశీథి వసతి', 'నిరీక్షణ', 'మరణభిక్ష', 'నయబోధ', 'ఓదార్పు', 'అపవాదు', 'త్రిమూర్తి' , 'హంతకుడు', 'సంగీతమాత', మొదలైన గేయాలు ఇందులో ఉన్నాయి. 'హంతకుడు' కవితా ఖండికలో .......

దొరల పరువుల విఱచిన చిఱుతనవ్వు,
పగకు బ్రేమలు నేర్పిన పసిడి నవ్వు,
పుడమిలో గొని యేలిన బోసి నవ్వు,
ముగిసెనా మాకు? బెదవుల మూసినావె!

అంటూ గాంధీజీ నిర్మలత్వాన్ని తెలియజేస్తూ, గాంధీజీ హత్యకు విలపించారు. 'సుందర సుధాబిందువులు' రెండవ భాగం పాటల పందిరి. ఇందులో 'మాదేశం', 'తెలుగుతల్లి', 'అసురమూర్తి', 'ఆగష్టు పదునైదు 'జయపతాక', 'జయనాయక దినము', 'సుక్కురోరం' మొదలైన పాటలున్నాయి.

భారతదేశం గొప్పతనాన్ని 'మాదేశం' పాటలోను, తెలుగునేల గొప్పతనాన్ని 'ఆగష్టు పదునైదు' పాటలోను, స్త్రీలకు ప్రియమైన శుక్రవారం పూజను గురించి 'సుక్కురోరం' పాటలో వర్ణించారు.

శ్రీమద్రామాయణ భారత భాగవత మహా గ్రంథాలను సామాన్యులు చదువుకొనవలెననెడి భావంతో వీరు సులభశైలిలో, సరళంగా, మధుర గీతికలతో మలచి సాహిత్య సేవ చేయ సంకల్పించినట్లు శ్రీ సుందరాచారి 'సుందర భారతం' కావ్యానికి ముందు మాట రాస్తూ పేర్కొన్నారు. నన్నయ నుంచి నేటి వరకు అనేక మంది కవులు, రచయితలు భారతాన్ని తమదైన ప్రత్యేకశైలిలో రచించినా శ్రీ సుందరాచారి సామాన్యులు చదువుకొనుటకు అనువైన శైలిలో సరళంగా, మధురంగా రాయడం ప్రధానోద్దేశ్యంగా తెలుస్తుంది. రచయిత చెప్పినట్లుగా 'సుందర భారతము' సరళమైన పదాలతో, తెలుగు పలుకుబడులు, సామెతలతో అలరించే సుందరకావ్యం. ఈ కావ్యం చివరిలో రచయిత తాను పండితుడను గాననీ, ఏ గురువు దగ్గర శిక్షణ పొందలేదనీ, ప్రకృతి సిద్ధంగా లభించిన తెలుగునే రాశానని చెపుతాడు. ఇక్కడ రచయితకు సాహిత్యం సహజ సిద్ధంగా లభించిన వరమని తెలుస్తుంది. కౌరవ, పాండవుల కథనాన్నే వీరు 'సుందర భారతం' కావ్యంలో రచించారు.

ఆరువందల తేటగీతి పద్యాలతో వీరు రామాయణాన్ని (సుందర రామాయణంగా రచించారు.

విశ్వనాథ, రాయప్రోలు, గడియారం వంటి ప్రముఖుల ప్రశంసలనే గాక 'ప్రసన్నకవి' బిరుదును పొందారు.

1975 ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సన్మానంతో పాటు, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ప్రశంసలను పొందిన శ్రీ సుందరాచారి 1977 ఏప్రిల్ 8వ తేదీన తిరుపతి పుణ్యక్షేత్రంలో పరమపదించారు.

**నామిని సుధాకర్ నాయుడు**
తెలుగు విశ్వ విద్యాలయం
పబ్లిక్ గార్డెన్స్
హైదరాబాదు - 500 004

# జాతర్లు-తిరునాళ్ళు

జాతర్లు-తిరునాళ్ళు అనే పదాలు సమానార్థకాలు. జాతర అనగా 'శక్తి ఉత్సవం' అనీ, తిరునాళ్ళు అనగా 'దేవోత్సవం' అని అర్థం. కాని లౌకికార్థంలో పరిశీలిస్తే జాతర గ్రామ దేవతలకు చేసే ఉత్సవాల పండుగ అని, తిరునాళ్ళు శైవ దేవాలయాల్లో గాని, విష్ణు దేవాలయాల్లో గాని జరిపే పండుగ అని తెలుస్తుంది. గ్రామ దేవతలు నూటొక్క దేవతలని నానుడి. ఒక్కొక్క గ్రామానికి, ఒక్కొక్క పేరుగల దేవత రక్షగా ఉంటుందని గ్రామ ప్రజల నమ్మకం. ఈ దేవతలందరూ దాదాపుగా రక్త ప్రీతిగలవారే. ఈ దేవతలకు బలి ప్రధానం. మొక్కే మొక్కులన్నీ బలులే. కోడినో, మేకపోతునో, గొర్రెపోతునో, దున్నపోతునో బలి ఇవ్వటం ఆచారం. ఈ విధంగా బలియిస్తే తమ కోరికలు తీరతాయనే జానపదుల నమ్మకమే దీనికి కారణం. మానసిక దౌర్బల్యానికి లోనయిన వారు తమకు కలిగిన కష్టాలు, బాధలు తొలగిపోయినట్లయితే ఆయా గ్రామదేవతలకు బలులు సమర్పిస్తామని మొక్కుకుంటారు. ఆ మొక్కులు సంవత్సరానికి ఒకసారి జాతర సమయాల్లో మాత్రమే తీర్చుకుంటారు. ఈ జాతర్లు ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క గ్రామంలో జరుగుతుంటాయి.

తిరునాళ్ళలో బలి విధానం ఉండదు. కొబ్బరికాయలు, పూలు, పళ్ళు, వడపప్పు, పానకం, మొదలైన శాకాహార పదార్థాలు ఇందులో ప్రాతినిధ్యం వహిస్తాయి. నిర్ణయించబడిన రోజున దైవదర్శనం చేసుకొని నైవేద్యాలు సమర్పించి అనేక మంది ఉత్సవంలో పాల్గొంటారు. ఈ ఉత్సవాలు జరిపే ప్రదేశంలో చిన్న పెద్ద వ్యాపారస్తులు తమ వ్యాపార సౌలభ్యం కోసం వివిధ వస్తువుల్ని తినుబండారాల్ని తీసుకవచ్చి అమ్ముతారు. గతంలో పట్టణాలు చాలా తక్కువుగా ఉండేవి. ఈ తిరునాళ్ళ సమయాల్లో ప్రజలు తమకు కావలసిన వస్తువుల్ని తెచ్చుకోవటం కోసం కూడా తిరునాళ్ళకు వెళ్ళటం జరుగుతుండేది.

అయితే కొన్ని పల్లె ప్రాంతాల్లో ముఖ్యమైన కొన్ని పండుగ సందర్భాల్లో కూడా జాతర్లు జరుపుకోవటం జరగుతుంది. ఏరువాక, సంక్రాంతి, దసరా, మొదలైన పండుగ రోజుల్లో చేసే జాతర్లలో జంతుబలి కూడా జరుగుతుంటుంది.

జాతర్లలో డప్పులు మోగుతుంటాయి. వేపమండలు, సాంబ్రాణి పొగ, కల్లు, సారాయి, మొదలైనవి ముఖ్య సాధనాలు. దేవతలకు కల్లు కుండలు దిగదుడిచి వాటిని ప్రసాదంగా స్వీకరిస్తారు. జంతువులనుగాని, పక్షులనుగాని బలి చేసేటప్పుడు వాటి మెడలో వేపమండకట్టి, పసుపు పూసి నిప్పులపై సాంబ్రాణి పొగవేసి మూడు సార్లు దిగదుడిచి తలకోసం, తల ఎడమ వైపున, మొండెం కుడివైపున ఉంచుతారు. తల దేవత వద్ద ఉండే గణాచారి తీసుకొంటాడు. ఈ గణాచారి గ్రామదేవత ఆలయానికి పూజారి వంటివాడు. వేదమంత్రాలు తెలియకపోయినా జాతర్ల సమయంలో ఇతనికి దేవత పూనటం జరుగుతుంది. దీన్ని పూనకం అంటారు. దీన్నే పారవశ్యం అనుకోవచ్చు.

ఇటువంటి జాతరలు లేదా కొలువులు సాధారణంగా ఊరిలో గాలి, గత్తర చెలరేగినప్పుడు ఉపశమనార్థం జరిపిస్తుంటారు. కొలుపులు సాగించటానికి ఊరంతా కలసి నిశ్చయించగానే ఆ వార్త టముకు ద్వారా ప్రచారం చేయబడుతుంది. గ్రామం మధ్యలో 'కలశ' స్థాపన జరుగుతుంది. అట్లా కలశాన్ని స్థాపించటాన్ని 'పురం వెయ్యటం' అంటారు. అక్కడ అమ్మను ప్రతిష్ఠించగానే

కొలుపులు ఆరంభమైనట్లే. ఊరి వారందరూ తమ తమ మొక్కులననుసరించి దేవికి బోనాలు చెల్లిస్తారు. బలులర్పిస్తారు. రంగులతో చిత్రించిన పూజ కుండల్లో ముందు రోజు అన్నం వండి ఉంచుతారు. ఆ కుండను 'చద్దికలశం' అంటారు. దీని మీద మరో చిన్న ముంతలో పానకం పోసి ఉంచుతారు. దీన్ని 'కడుముంత' అంటారు. కడుముంత మీద ఉంచిన మూకుడు వంటి దాన్ని 'కంచుడు' అంటారు. ఈ కంచుడులో నూనె పోసి జ్యోతి వెలిగిస్తారు. ఆ దొంతిని తలపై కుదురుగా ఉంచుకొని అమ్మవారి దగ్గరకు తీసుకపోవటమే బోనాలు తీసుక పోవటం. ఒక ముంత కల్లు గాని, నీళ్ళు గాని అమ్మవారి ముందు వారబోసి, బోనాన్ని ఎవరికి వారే దేవతకు నివేదిస్తారు. ఇలా వారబొయ్యడాన్ని 'సాక' అని కూడా అంటారు. అమ్మవారి కొలుపును, తెలంగాణా ప్రాంతంలో బోనాల పండుగ అని కూడా వ్యవహరిస్తారు. జాతర చివరి రోజున 'పోతుబోనం' చెల్లించటమనే తంతు సాగుతుంది. ఊరి వారంతా కలసి ఉమ్మడిగా కొన్న పోతును బలి ఇవ్వడం ఆ రోజు జరుగుతుంది. పోతు అంగలోపం లేనిదై ఉండాలి. దాన్ని గ్రామ దేవత ముందు బలియిచ్చి అక్కడ పోసిన కుంభం మీద ఆ రక్తాన్ని చల్లుతారు. రక్తసిక్తమైన ఆ అన్నాన్ని ఊరి వీధులో చల్లుతారు. ఆ మెతుకులు పడ్డ చోట అంటు వ్యాధులు సోకవని ప్రజల విశ్వాసం.

జాతర ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క రకంగా ఉంటుంది. గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలో జరిగే కొండపాటూరు జాతర విచిత్రంగా ఉంటుంది. ఈ ఉత్సవం సంవత్సరానికి ఒకసారి జరుగుతుంది. ఆ గ్రామ దేవత పోలేరమ్మ. ఈ పోలేరమ్మ జాతరకు దూర ప్రాంతం నుండి జనం లక్షల సంఖ్యలో వస్తారు. కోరిన కోరికలు తీరతాయని, పోలేరమ్మ తల్లి చల్లని తల్లి అని అక్కడి ప్రజలు నమ్మకం. పంటలు బాగా పండిన వాళ్ళు, సంతానం కోరేవారు. సంతానవంతులయినవారు ఎక్కువగా వస్తారు. జాతర సాయంత్రం ఆరు గంటల నుంచి ప్రారంభమవుతుంది. జంతు బలి బాగా ఉంటుంది. ముఖ్యంగా కోళ్ళ వధ ఎక్కువగా ఉంటుంది. మొక్కులు తీర్చుకోవడానికి వచ్చిన వాళ్ళు కోళ్ళను బలి చేసి అక్కడే వండుకు తిని పోలేరమ్మ తల్లికి నైవేద్యం సమర్పించి తమ మొక్కులు తీరాయని భావిస్తారు. ఈ ఉత్సవంలో మాతంగులు ప్రధానమైన పూజారి వర్గం లాంటి వాళ్ళు. ఆడపడుచుల్ని మాతంగులుగా మార్చే ఆచారాన్ని పాటించే కుంటుంబాలు ఈ ప్రాంతంలో ఉన్నాయి.

గ్రామ దేవతకు జరిపే కొలుపుల్లో మాతంగి చిందేసే ఆచారం అనాదిగా వస్తుంది. మాతంగి కల్లు పుక్కిట బట్టి చుట్టూ చేరిన వారిపై ఉమ్మి వేస్తే వారి పాపాలు పోతాయని కొలుపులు చేసే ప్రజలు మూఢంగా నమ్ముతారు. మూఢ విశ్వాసాలవల్లనూ, జాతర్ల సందర్భంగా లభించే పారితోషికం వల్లనూ తమ బాలికలను మాతంగులుగా మార్చటానికి కొందరు తల్లిదండ్రులు అంగీకరిస్తారు.

[illegible]జ్ఞానం లేని పదేళ్ళ వయసు బాలికను ఎంపిక చేసి మాతంగిగా మారుస్తారు. గుడి వద్ద గుంట తీసి బాలికకు పసుపు కుంకుమ రాసి ఆ గుంటలో కూర్చోబెట్టి వేపమండలతో కప్పి వేస్తారు. ఆమెను మూడు రోజుల పాటు అక్కడే ఉంచుతారు. ఈ మూడు రోజులపాటు పాలు తప్ప వేరే ఆహారం ఇవ్వరు. ఈ తంతు పూర్తికాగానే ఆ బాలిక మాతంగిగా మారినట్లు భావిస్తారు. కుల పెద్ద చేత తాళి కట్టిస్తారు. తాళి కట్టినవాడు మరణించినా ఆమె సుమంగళిగానే ఉంటుంది. ఆమెకు చిందు నేర్పుతారు. యుక్త వయసు రాగానే ఆమె తనకు ఇష్టమైన వారితో జత కట్టవచ్చు. ఎవరి కామవాంఛనైనా తీర్చవచ్చు. కొలుపుల్లో చిందేయటం, కల్లు పుక్కిలించి ప్రజలపై ఉమ్మివేసి వారి పాపాలు తగ్గించటం ఆమె విధి. ఈ కారణంగా కల్లు, సారా తాగటం అలవాటు చేసుకొంటుంది. కొన్నాళ్ళకు తాగందే చిందేయలేని పరిస్థితికి దిగజారుతుంది. కొలుపుల్లో లభించే పారితోషికం జీవనోపాధికి చాలకపోవడంతో ఆమె వ్యభిచారాన్ని కూడా వృత్తిగా స్వీకరిస్తుంది.

తెలుగు దేశంలో ఉన్న ప్రసిద్ధ శైవ క్షేత్రాలలో కోటప్పకొండ ఒకటి ఇది గుంటూరు జిల్లా నరసరావు పేటకు దక్షిణంగా పది కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇది రెండు, మూడు కిలోమీటర్లు వ్యాపించి ఉన్న ప్రసిద్ధ శైవ పర్వత క్షేత్రం. ఈ కొండపైన సుమారు 1600 అడుగల ఎత్తులో ఒక గుడి ఉంది. దీనిని పాతకోటప్పగుడి అని పిలుస్తారు. 600 అడుగుల ఎత్తులో ఇప్పుడు ఉత్సవాలు జరిగే కొత్త కోటప్ప గుడి ఉంది. ఇది శివలింగంతో కూడిన దేవాలయం. శైవ ప్రీతికరమైన పండుగ రోజుల్లో ఈ స్వామికి, ఉత్సవం జరుపుతారు. ముఖ్యంగా మహా శివరాత్రి రోజున మహా ఉత్సవం జరుపుతారు.

ఈ ఉత్సవం రోజున దేశంలోని మారుమూల ప్రాంతాల నుండి కొన్ని వేల లక్షల సంఖ్యలో భక్తులు ప్రభలు కట్టుకొని ఇక్కడకు వస్తారు. శక్తిలేని వారు వీపుకు ప్రభలు కట్టుకుంటారు. చేదుకో కోటయ్య 'శంభోశంకర' 'హరహర మహదేవ' అనే నినాదాలు ఇక్కడ ప్రధానం. కొండ ఎక్కి అక్కడ మొక్కు బడులు చెల్లిస్తారు. కొబ్బరికాయలు, బెల్లం, పూలు, విభూతి ప్రధానమైన నైవేద్యాలు. ఈ స్వామికి మొక్కుకుంటే ఏ కష్టం వచ్చినా, ఏ ఆపద వచ్చినా అవి తొలగిపోతాయని భక్తుల నమ్మకం.

ప్రభలు కట్టడం, ఆ ప్రభల ముందు వీరంగాలు వేయటం, కత్తులు తిప్పటం, కర్రసాము చెయ్యటం మొదలైనవి ఉంటాయి. ఇవి కూడా మొక్కుకున్న వాటిలో భాగమే. రాత్రి జాగారం చెయ్యటం, ఉదయం శివారాధన ఇక్కడ జరిగే శివరాత్రి పండుగ తిరునాళ్ళ.

తెలుగుదేశంలో ప్రజలు అనేకరకాలుగా ప్రకాశం జిల్లా నాగులుప్పలప్పాడు మండలంలో చినగంజాం తిరునాళ్ళను శివరాత్రి పండుగరోజున, చీరాలమండలంలో తోటరవారి పాలెం తిరునాళ్ళను, తూర్పు గోదావరి జిల్లా పెద్దాపురంలో మరిడమ్మ జాతరను, తిరుపతిలో గంగమ్మ జాతరను మే నెలలోను, విశాఖపట్నంలో మాలక్ష్మమ్మ జాతరను అక్టోబర్ నెలలోను జరుపుతున్నారు. ఇంతేగాకుండా అనేకరకాలుగా ఈ జాతర్లు-తిరునాళ్ళను ఆయా సందర్భాలలో ప్రజలు అత్యంత భక్తి శ్రద్ధలతో జరుపుకుంటున్నారు.

**ఆనంగి వెంకటప్పయ్య**
తెలుగు విశ్వవిద్యాలయం, సాహిత్య పీఠం
బొమ్మూరు-533 124, రాజమండ్రి

# ఆధునిక యక్షగాన ప్రక్రియకు వన్నె తెచ్చిన భుజంగరాయశర్మ సాహితీ ప్రతిభ

సంగీతం గొప్పది.
అంతకంటే చిత్రలేఖనం గొప్పది.
చిత్రలేఖనం కంటే శిల్పం గొప్పది.
శిల్పం కంటే నాట్యం గొప్పది.
నాట్యం కంటే కవిత్వం గొప్పది.

కానీ - వీటన్నింటి యొక్క సమాహారం ఒకరిలో ఉండడం విశేషం కదా మరి! శ్రీరామ్ వేంకట భుజంగరాయశర్మ గారిని గురించి ఆధునికాంధ్ర సాహితీ ప్రపంచంలో కేవలం కొద్దిమందికి మాత్రమే తెలుసు. కూచిపూడి ఆర్ట్ అకాడమీ (మద్రాసు) తరపున నిర్వహించి ప్రదర్శింపబడు నృత్య నాటికలన్నింటినీ ఆయన రచించి, కూచిపూడి నాట్యకళనే కాక ఆధునిక యక్షగానప్రక్రియ అనే ఒక విశిష్టమైన ప్రక్రియను మలచి నృత్య నాటికా రచనకే ఒక సమున్నతమైన స్థాయిని తెచ్చిపెట్టారు.

శ్రీ శర్మ గారు కేవలం నృత్య నాటికలు రచించినప్పటికీ ఎన్నో అద్భుతమైన రేడియో ప్రసంగాలు చేశారు. మరెన్నో రేడియో కవి సమ్మేళనాలలో పాల్గొన్నారు. కానీ అవి ఎక్కడా పెద్దగా ప్రచురింపబడక పోవడం చేత కేవలం నృత్య నాటిక రచనలో సిద్ధహస్తులుగానే తెలుగుదేశం చేత గుర్తింపబడ్డారు. కానీ వారి రేడియో ప్రసంగాలన్నీ 'దీపమాలిక' అనే పేరుతో యస్.యస్. లక్ష్మిగారు (సంపాదకురాలు ఆహ్వానం మాసపత్రిక) ప్రచురించడం వల్ల కొంతవరకు ఆ లోటు భర్తీ అయిందని చెప్పవచ్చు.

కూచిపూడి ఆర్ట్ అకాడమీకి నిర్మాత, సారథి మొత్తం నిర్వహణ బాధ్యతను స్వీకరించినవారు ప్రముఖ నాట్య కళాకోవిదులైన శ్రీ వెంపటి చిన్న సత్యంగారు. శ్రీ సత్యంగారు నాట్య విభాగానికి సంగీతరావు గారు (పట్రాయని నరసింహ శాస్త్రి) సంగీత విభాగానికి, భుజంగ రాయశర్మ గారు రచనా విభాగానికి సారధులు. ఈ ముగ్గురి కలయిక వల్ల కూచిపూడి ఆర్ట్ అకాడమీ అత్యుత్తమ నృత్య నాటికలను ప్రదర్శిస్తున్నది. విశేషమేమంటే ఈ ముగ్గురిలో - ఏ ఒక్కరి ప్రతిభ మాత్రమే కూచిపూడి నృత్య నాటికను గుర్తింపు తీసుకొని రాలేదు. ముగ్గురి అపూర్వ సమ్మేళనంతో ఈ నృత్య నాటికలు కేవలం ఆంధ్రదేశం, భారతదేశంలోనే కాక, విదేశాలలో కూడా 'కూచిపూడి ఆర్ట్ అకాడమీ'ని స్థాపించే స్థాయికి ఎదిగి కూచిపూడి నృత్యకళకు ఒక ప్రత్యేకతను సంతరించి పెట్టాయి.

'కూచిపూడి ఆర్ట్ అకాడమీ' వారు ప్రదర్శించు నృత్యనాటికలలో 'శ్రీకృష్ణ పారిజాతం, చండాలిక, కళ్యాణ రుక్మిణి, పద్మావతి శ్రీనివాసమ్, అభిజ్ఞాన శాకుంతలమ్ వంటివి పేర్కొనబడినప్పటికినీ, మిగిలిన కవులు రచించిన నృత్య రూపకాలు శ్రీ శర్మగారి రచనాస్థాయికి రాలేకపోయినవి. (బాలాంత్రపు రజనీకాంతరావుగారు దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి గారితో కలసి రచించిన 'క్షీరసాగర మథనం' పెద్దగా గుర్తింపును పొందలేకపోయింది.)

పారిజాతం శ్రీ శర్మగారి కలం నుండి జాలువారిన మొట్టమొదటి నృత్య నాటిక. ప్రాచీన ప్రబంధాలకు మకుటాయమానంగా నిలిచిన పారిజాతాపహరణంలో ప్రబంధ కవి నంది తిమ్మనార్యుడు తన అద్భుత ప్రాబంధికమార్గంలో సత్యభామను ఒక అపూర్వ కథానాయికగా సృష్టించి, చివరకు ఆమెను ఒక తెలుగువారి

ఆడపడుచుగా తీర్చిదిద్దాడు. తెలుగింటి ఆడపడచులోని కోపం, తాపం, రౌద్రం, మూర్ఖత్వం, చమత్కారం మాట పట్టింపు, వ్యంగ్యం, అహంకారం, సహించరానితనం వంటి లక్షణాలను ఆమెలో రాశీభూతం చేసి సత్యభామను తీర్చిదిద్దారు. ఆ లక్షణాలనేమీ పొల్లు పోనీయకుండా సత్యభామను తీర్చిదిద్ది తెలుగు ప్రజలకు అందించారు. నృత్య నాటిక రచనాపరంగా శ్రీ కృష్ణపారిజాతం ఒక గొప్ప మేలిమి రచన. అందులో శ్రీ శర్మ గారు సత్యభామను నెఱజాణగా, సవతి మాత్సర్యానికి ప్రతీకగా రూపుదిద్దారు. అయినా అలుక మానవుగదా! 'ఇకనైన మరాళకుంతలా!' అని సత్యభామపరంగా శ్రీకృష్ణుని చేత పలికించిన ముక్కు తిమ్మనార్యుని ముద్దు ముద్దు పలుకులలోని ఔన్నత్యాన్ని శ్రీ శర్మగారు తమ శ్రీకృష్ణ పారిజాతంలోని సత్యభామలో చక్కగా చిత్రీకరించారు. మొత్తం మీద కొన్ని వందల ప్రదర్శనల భాగ్యానికి నోచుకొన్న శ్రీకృష్ణ పారిజాతం భుజంగరాయ శర్మగారి నృత్యనాటకరచనా సామర్థ్యానికి ఒక దర్పణంగానే మిగులుతుంది.

'చండాలిక' రవీంద్ర కవీంద్రుని అపూర్వసృష్టి. రవీంద్రుని రచనలలో చండాలికకు ఒక విశిష్టత ఉంది. బౌద్ధ జాతక కథల నుండి స్వీకరింపబడి రచింపబడ్డ ఈ రచన వంగ సాహిత్యంలో కేవలం రవీంద్రుని రచనగానేగాక, ఒక మేలిమి రచనగా కూడా కీర్తింపబడింది. అటువంటి రచనను కేవలం నామమాత్రంగానే స్వీకరించి తన స్వీయ ప్రతిభా పాటవాలను జోడించి, చివరకు ఒక అపూర్వమైన స్వతంత్రమైన నృత్య నాటికగా తీర్చిదిద్దారు. రవీంద్రుని చండాలికకు శర్మ గారి చండాలికకు రచనలోగాని, వస్తు స్వీకరణలోగాని, శైలిలోగాని పాత్ర చిత్రణలోగాని ఎటువంటి పోలికా లేదు. రెండూ రెండు భిన్నమైన రచనలే! కానీ ఒక విధంగా ఆంధ్ర సాహిత్యంలోని చండాలికకే నృత్య నాటికాపరంగా మంచి గుర్తింపు లభించింది. 'చండాలిక' రచనలో శ్రీ శర్మ గారు రవీంద్రుని హృదయాన్ని అర్థం జేసుకొని, ఆ హృదయానికి తన కవితా పరిమళాన్ని జోడించి 'చం'డాలికను తెలుగువారి ఆడపడచుగా తీర్చిదిద్దారు. ఒక తెలుగింటి ఆడపడచుగా చిత్రీకరింపబడ్డ 'చండాలిక పాత్ర నాస్తిక, ఆస్తికత్వాల మధ్య ఘర్షణకు ప్రతీకగా నిలిచి చివరకు బౌద్ధమత మౌఢ్యానికి, సంఘ వ్యతిరేకతకు దర్పణంగా నిలుస్తుంది. చండాలిక ఒక హరిజన బాలిక. ఆమెను బాధించే అంటరానితనం, అస్పృశ్యతలు ప్రధాన పాత్ర వహిస్తాయి. ఇందులో సమస్య కూడా హరిజనులను ఉద్దేశింపబడి రచింపబడ్డదే! మొత్తానికి ఈ అంశాలను మనసులో ఉంచుకొని శ్రీ శర్మగారు దీనిని ఒక అపూర్వ నృత్యనాటికగా తీర్చిదిద్దారు.

'అభిజ్ఞానశాకుంతలం' భుజంగరాయశర్మగారి మూడవ నృత్యనాటిక. కాళిదాసు వంటి మహాకవీశ్వరుని చేత రచింపబడ్డ 'శాకుంతలం' అనే నాటకాన్ని ఆధారంగా చేసుకొని భుజంగరాయశర్మ గారు ఈ నృత్యనాటికను రచించారు. సంస్కృత సాహిత్యంలో వాల్మీకి ఆదికవి అయితే కాళిదాసు కవి కులగురువు. అటువంటి కాళిదాసు మహాకవి నాలుగు కావ్యాలను, మూడు నాటకాలను రచించారు. కాళిదాసు మహాకవి మిగిలిన రచనలన్నీ ఒక ఎత్తు. ఒక్క అభిజ్ఞాన శాకుంతలం ఒకటే ఒక ఎత్తు. 'శాకుంతలం' నాటకంలో ఆయన ఎన్నో నీతులను, బోధనలను, నీతిదాయకమైన అంశాలను ప్రవచించారు. వాటన్నింటినీ జాగ్రత్తగా అర్థం జేసుకొని శ్రీ శర్మగారు 'శాకుంతలం'ను ఒక మహోన్నతమైన నృత్య నాటికగా రూపొందించారు.

తెనుగు సాహిత్యంలో భుజంగరాయశర్మ నృత్య నాటికా రచనకు, ప్రతిభకు దర్పణంగా నిలిచే మరొక మేలిమి రచన 'పద్మావతీ శ్రీనివాసమ్' 'తిరుమల తిరుపతి దేవస్థానం' వారి నేతృత్వంలో దేవస్థానంవారు స్వామివారి కథను నృత్య నాటికగా మలచడానికి తమ కోరికను వెల్లడించగా ఆ విషయాన్ని ఆనాటి సుప్రసిద్ధ సినీ దర్శకులు, కళాతపస్వియైన శ్రీ బి.యన్. రెడ్డిగారు, కూచిపూడి ఆర్ట్ అకాడమీ అధినేత శ్రీ వెంకటచినసత్యం, భుజంగ రాయశర్మగారలు ఈ విషయకంగా కడు సమర్థులని వారే ఈ నృత్య నాటికను రూపొందిచగలరని చెప్పగా, వారు ఆ ఇద్దరికీ ప్రస్తుత బాధ్యతను అప్పగించారు. కంగా తయారైంది 'పద్మావతీ శ్రీనివాసమ్' దీనికే

'శ్రీనివాస కళ్యాణమ్' అని మరొక పేరుంది.

మిగిలిన సంగీత, నృత్యాల మాట అటుంచితే ఒక్క రచనాపరంగా పరిశీలిస్తే, భుజంగరాయశర్మ గారు తమకున్న శక్తి సామర్థ్యాల నన్నింటినీ ఇందులో వినియోగించి, నృత్య నాటక రచనకే ఒక సమున్నత గౌరవాన్ని సంపాదించి పెట్టారు. ఇందులో ఆయన వాడిన వృత్తాలు, జాతులు ఆయన ఛందో వైవిధ్యానికి దర్పణాలుగా నిలుస్తాయి. నృత్య నాటికలోని పద్యాలు, పాటలు, గేయాలు, వచనం ఆయన రచనా పరిపుష్టిని వ్యక్తం చేస్తాయి. ఒక్క రచనా పరంగానే కాకుండా మిగిలిన అన్నింటి దృష్ట్యా కూడా అది గొప్పదే! అందువలననే 'పద్మావతీ శ్రీనివాసమ్' చూచాక సుప్రసిద్ధ కవి విమర్శకులైన శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు 'పద్మావతీ శ్రీనివాసమ్' ద్వారా శర్మగారు కవిగా ఉన్నత శిఖరాలను దర్శించారు." అన్నారు. దీనిని బట్టి పద్మావతీ శ్రీనివాసమ్ రచన ఎంత ఉన్నతమైందో, ఉదాత్తమైందో మనం ఊహింపవచ్చు.

కళ్యాణ రుక్మిణి 'ఇటీవలనే రచించి, కూచిపూడి ఆర్ట్ అకాడమీ తరపున ప్రదర్శింపబడుతున్న శర్మగారి తాజా రచన. సహజ పాండిత్య బిరుదాంకితుడైన బమ్మెర పోతనామాత్యుని ఆంధ్ర మహాభాగవతాన్ని ఆధారంగా చేసుకొని, అందలి రుక్మిణీ కళ్యాణ ఘట్టాన్ని మాత్రమే స్వీకరించి తద్వారా భాగవత కవితాతత్త్వాన్ని అవగతం చేసుకొని నృత్య నాటికగా రూపొందించడం, అందులోనూ పోతనకు సంబంధించినవీ కవితాపరంగా పోతన పేర్కొన్న కొన్ని ఘట్టాలనూ స్వీకరించి శ్రీ శర్మగారు సాహితీపరంగా, వానికి ఉన్నతమైన విలువలను కల్పించి రచనాపరంగా ఒక నిండుదనాన్ని తీసుకొని వచ్చారు.

ఉదాహరణకు రుక్మిణి మనసా వాచా కృష్ణుణ్ణి వివాహం చేసుకోడానికి సిద్ధమౌతుంది. అందులకు ఆమె అన్నలు అంగీకరించరు. అప్పుడు కృష్ణుడికి తనను వచ్చి వివాహం చేసుకోమని ఒక వర్తమానం అగ్నిద్యోతనుడనే బ్రాహ్మణుని ద్వారా పంపుతుంది. అప్పుడు తనకు సంబంధించిన గుర్తులను కృష్ణుడికి తెలిపే ఘట్టంలో ఒక చోట రుక్మిణి పరంగా శ్రీ శర్మగారు చరించిన 'కాటుక కన్నుల గుర్తు ...... వెలుగిలి రేకుల నేను నాతిని ఇంతకన్న నేమి సేతు ... అన్న సీసపద్యం మూల భాగవతంలో లేదు. ఇది శ్రీ శర్మ గారి స్వీయరచన. అది ఆయన ప్రతిభకు ఒక మచ్చుతునక. ఇలాంటివి కళ్యాణ రుక్మిణిలో ఎన్నో ఉన్నాయి.

నిజానికి తన వంటూ చెప్పుకోదగిన రచనలు ప్రచురింపబడినవి. లేకపోయినప్పటికినీ, నృత్య నాటిక రచనాపరంగా పరిశీలిస్తే గొప్ప విభిన్నమైన కథలు, భిన్నమైన సన్నివేశాలు, సంఘటనలు, పాత్రలు, సంభాషణలూ అయినప్పటికినీ, దేని ప్రత్యేకతను దానిని మనసులో ఉంచుకొని, అన్నింటి ఔన్నత్యాన్ని కాపాడుతూ, నృత్యనాటిక రచనకు సంబంధించిన సంప్రదాయాలను విడనాడకుండా ప్రతి రచనకు ఒక ఔన్నత్యాన్ని చేకూర్చుతూ తన దైన ప్రతిభాపాటవాన్ని వ్యక్తం చేశారు. శర్మగారు.

ఆధునికాంధ్ర సాహితీ ప్రపంచంలో ఏర్పడ్డ వినూత్నమైన సాహితీ ప్రక్రియలలో 'ఆధునిక యక్షగానం' ఒకటి. దీనినే నృత్య నాటికయని, ఇంగ్లీషులో 'Ballad' అని అంటారు. ప్రాచీన సాహిత్యంలో యక్షగాన ప్రక్రియ కూడా లేకపోలేదు. కానీ ప్రాచీన యక్షగాన ప్రక్రియకు, ఆధునిక యక్షగాన ప్రక్రియకు ఎంతో భేదముంది. వైవిధ్యముంది. యక్షగానమనగా దశ రూపకాలలోని వీధి, అంకం, వ్యాయోగం వంటి దశ రూపకాలకు చెందింది కాదు. ప్రాచీన యక్షగానాలనే కూచిపూడి భాగవతులు తమ నాట్య భంగిమలకు అనుగుణంగా మలుచుకొని, ఇంతకు ముందు ప్రదర్శించేవారు. కానీ నేటి మన వెంపటి చినసత్యం వంటి సుప్రసిద్ధ నాట్యాచార్యులు యక్షగాన ప్రక్రియను, కూచిపూడి సంప్రదాయాలను అనుసరిస్తూ వాని ఔన్నత్యానికి భంగం కలుగనీయకుండా ఆధునిక రీతిలో నృత్య నాటిక పద్ధతిలో వానిని మలచి కేవలం నాట్యపరంగానే కాకుండా, వానికి సంగీత సాహిత్యాలను మేళవించి అపూర్వమైన రీతిలో నృత్యనాటికలను రూపొందించి ప్రదర్శిస్తున్నారు. అందువల్లనే ఇంతకు ముందులేని సాహిత్య

ఇటుల ఈనాటి నృత్య రూపకాల్లో మనకు గోచరిస్తున్నవి. అందుకు శర్మగారి వంటి ప్రతిభావంతులే తార్కాణాలుగా నిలుస్తారు.

అధునిక నృత్యనాటికలను రచిస్తున్న వారిలో భుజంగరాయశర్మ గారిలాగా, ఇంకా బాలాంపుత్ర రజనీకాంత రావుగారు, దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారు, (క్షీరసాగర మథనం), ఇంద్రగంటి భానుమూర్తిగారు, (భక్తప్రహ్లాద, హరవిలాసం), ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారు(వాల్మీకిచరిత్ర) వంటివారు ముఖ్యులు. తెలుగు దేశంలోనే గాక, దేశ విదేశాలలో కూడా ఈ యక్షగానమనే ఆధునిక నృత్య నాటిక ఎంతో మన్నన పొందగలుగుతున్నది. అది ఇందలి విశేషం!

నృత్యనాటికల రచనాపరంగా తగినంతటి ప్రసిద్ధి పొందినప్పటికినీ, శర్మగారి ప్రతిభ అంతవరకే పరిమితం కాలేదు.

ఆయన ఎన్నో అంశాల మీద రేడియో ప్రసంగాలు చేశారు. వాటన్నింటిని కలిపి 'దీపమాలిక' అనే పేరుతో ప్రచురింపబడటం విశేషం. కేవలం రేడియో ప్రసంగాలే కాక, వివిధ తరగతుల పాఠ్య గ్రంథాలలలో సాహిత్య వ్యాసాలు రచించారు (నాకు నచ్చిన శతకాలలో రెండు). అంతేగాక తెలుగుదేశంలో ఎన్నో కళాశాలల్లో, పాఠశాలల్లో, సాహితీ సమావేశాలలో మేలిమి ప్రసంగాల నెన్నింటినో చేశారు. ప్రస్తుతం చేస్తున్నారు కూడా!

నిజానికి తనదంటూ ఒక గొప్ప రచనగావించి, పత్రికాముఖంగా గాని, గ్రంథ రూపంగా గాని ప్రచురింపబడక పోయినప్పటికినీ, తన నృత్యనాటికల ద్వారా ఆయన ఒక మంచి ప్రతిభావంతుడైన కవిగా సాహితీపరుడుగా, విమర్శకుడుగా, ఆధునికాంధ్ర సాహితీ లోకంలో నిలిచిపోయారు. ప్రతిభా, వ్యుత్పత్తి, అభ్యాసాలలో 'ప్రతిభయే గరీయసి' అని కొడాలివారి హంపీక్షేత్ర కావ్యానికి పీఠికరాస్తూ కవిసమ్రాట్ విశ్వనాథవారన్న మాటలు భుజంగరాయశర్మ వంటి విలక్షణ సాహితీమూర్తుల పట్ల అక్షరసత్యాలు

ఆయన-

చిత్రకారుడు-

సంగీతాభిమాని-

నటుడు-

నాటక రచనాశిల్పి -

ఇంతెందుకు? - అన్నీ కలిపిన ఒక సమాహారం

***ధూర్జటి వేంకటబాలాజి***

తెలుగు లెక్చరర్

*డో.నెం. 10-38-8బి, టీచర్ల కాలనీ*

*జనతాపేట ఫస్ట్ లైన్, కావలి - 524 202*

*నెల్లూరు (జిల్లా) ఆం.ప్ర.*



# హిందీ విజయపత్ర వితరణోత్సవము

కె. విమలాబాయి, కార్యదర్శి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, ఫిబ్రవరి 95లో నిర్వహించిన హిందీ పరీక్షల విజయ పత్ర వితరణోత్సవము ఖైరతాబాదులోని సభా భవనంలో నవంబర్ 2వ తేదీ జరిగింది.

హిందీ ప్రేమీ మండలి, హైదరాబాదు, ఆధ్వర్యంలో జరిగిన కార్యక్రమానికి ముఖ్య అతిథిగా వచ్చిన శ్రీ హెచ్.ఐ. టేటే, డిప్యూటీ డైరెక్టర్, కేంద్రీయ హిందీ డైరక్టరేట్, హైదరాబాదు విద్యార్థులకు విజయపత్రములు ప్రదానం చేశారు. సర్వ ప్రథమ, సర్వద్వితీయ సర్వతృతీయులుగా వచ్చిన విద్యార్థులకు బహుమతి ప్రదానం గూడా చేశారు. హిందీ నేర్చుకోటం ద్వారా ఉద్యోగాలు పొందటమే గాక జాతీయ భావం గూడా పెంపొందు తుందనియు, జాతీయ సమైక్యత దృష్ట్యా అందరూ హిందీ నేర్చుకోవాలని వారు తమ సందేశంలో పేర్కొన్నారు. హిందీ ప్రచారం దిన దిన ప్రవర్ధమానమవుతున్నదంటూ, యీనాడు ఏ నగరంలోని కేంద్ర ప్రభుత్వ కార్యాలయంలో చూచినా హిందీ టైపిస్టులు, స్టెనోలు, హిందీ అధికారులు దర్శనమిస్తుంటారని అన్నారు. నేటి మన ప్రధాని శ్రీ. పి.వి. నరసింహారావు తెలుగువాడైననూ హిందీ భాషా పరిజ్ఞానంవల్ల సర్వజనాదరణ పొందుతున్నారనియు, మాతృభాషతో పాటు హిందీ నేర్చుకొన్నవారు జీవితంలో రాణించటానికి వీలుంటుందని చెప్పారు.

ఇటీవలనే హిందీ ప్రచారం సభ (ఆంధ్ర) కార్యదర్శిని బాధ్యతలు చేపట్టిన శ్రీమతి కె. విమలబాయిగారు మాట్లాడుతూ ఆంధ్రప్రదేశ్‌లో ఇంత భారీ ఎత్తున ప్రచారం జరుగుచున్నందుకు ఇంత అధిక సంఖ్యలో విద్యార్థులు పరీక్షలో పాల్గొనుచున్నందులకు ఆనందం కలుగుతుందన్నారు. ప్రస్తుతం సభ ద్వారా నడుపబడే హిందీ పరీక్షలలో దాదాపు లక్ష మంది విద్యార్థులు హాజరవుతున్నారు. దీనితో సంతృప్తిపడక, అధికాధిక ఉత్సాహంతో ముందుకు పోవాల్సిన అవసరం యీనాడు మన ముందున్నదని వారు చెప్పారు.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ చవాకుల నరసింహమూర్తి, హిందీ ప్రచారాన్ని వివరిస్తూ హిందీ నేర్చుకోవడం వల్ల కలిగే లాభాలను పేర్కొన్నారు. వివిధ భాషల కూడలి యగు మన దేశంలో అనుసంధాన భాషగా హిందీ ఆవశక్యకత ఎంతగానో ఉందని చెప్పారు. భాష రెండు హృదయాలను కలుపుతుందని చెప్పారు. మాతృభాష, జాతీయ భాష రెండునూ మనకు రెండు నేత్రాలవంటివనియు, కావున ఆరెంటినీ నేర్చుకోటం అత్యావశ్యకమన్నారు. వాటి తర్వాతనే ఇంగ్లీషుకు స్థానం అన్నారు. హిందీ బోధనకు అధిక పిరియుడ్లు కేటాయించవలెననియు ఉత్తీర్ణతకై 30 మార్కులు నిర్ణయించాలనియు ఖాళీగా ఉన్న హిందీ పండితుల పోస్టులు నింపవలయునని ప్రభుత్వాన్ని కోరారు. ప్రచార సభ ద్వారా

నడచుచున్న స్నాతకోత్తర, కంప్యూటర్ కోర్సుల ద్వారాను, బి.ఎడ్. మరియు హిందీ ప్రచారక్ ప్రశిక్షణ కోర్సుల ద్వారాను లాభం పొందవలసినదిగా వారు విద్యార్థులను కోరారు. కేంద్ర ప్రభుత్వ గ్రాంటులపై ఆధారపడే ప్రస్తుత పద్ధతిని వదలి, రాష్ట్ర ప్రభుత్వ బడ్జెట్‌లో హిందీకి అవసరమైన నిధులు కేటాయించవలెనని వారు ప్రభుత్వాన్ని అభ్యర్థించారు.

కార్యక్రమ ప్రారంభంలో హిందీ ప్రేమీమండలి కార్యదర్శి శ్రీ యస్. సత్యనారాయణ స్వాగతోపన్యాసం చేశారు.

సర్వశ్రీ కడారు మల్లయ్య, గోదా తిరుమలయ్య, శ్రీమతి శీలా దేశపాండే, చవాకుల రామకృష్ణారావు ప్రభృతులు కార్యక్రమంలో పాల్గొన్నారు.

హిందీ ప్రేమీమండలి ఉపాధ్యక్షుడు శ్రీ జి. ఉమామహేశ్వరరావు వందన సమర్పణ చేశారు.

# పట్టణ హిందీ ప్రేమీ మండలి, గుంటూరు
# హిందీ విజయపత్ర వితరణోత్సవము

**- కుసుమహరనాథశర్మ**, కార్యదర్శి

ది. 25-11-95వ తేదీ సాయంత్రము 5-30ని॥లకు స్థానిక శ్రీమాజేటి గురవయ్య హైస్కూల్లో, ప్రేమీ మండలి ఆధ్వర్యమున హిందీ విజయ పత్ర వితరోణోత్సవము జరిగినది. ఈ సమావేశమునకు నగర మేయర్ శ్రీమతి డాక్టరు కె. శారదగారు ముఖ్య అతిథిగా విచ్చేసివారు.

మండలి ఉపాధ్యక్షులు శ్రీ చక్కా రామకృష్ణారావు గా.. .భాధ్యక్ష స్థానము వహించి హిందీ విశిష్టత, దక్షిణ భాంత హిందీ ప్రచారసభ, జాతీయ భాషా ప్రచారము కొరకై చేయుచున్న కృషిని ప్రశంసిస్తూ, దక్షణ దేశంలోని హిందీ ప్రచారకులు "మిషన్ స్పిరిట్"తో పని చేయుచున్నారని ప్రచారకులను అభినందించారు.

ముఖ్య అతిథిగా మేయర్ శ్రీమతి డాక్టరు కొల్లి శారదగారు తన ప్రసంగములో భాష ఆవశ్యకతను గూర్చి అంరూ హిందీ భాష నేర్చుకొనవలసిన ఆవశ్యకతను గూర్చి వక్కాణిస్తూ, జాతి సమైక్యతకు, భాషా సమైక్యతకు హిందీ నేర్చుకొన వలయునని, విద్యార్థులను ఆశీర్వదిస్తూ అన్నారు. పట్టణ హిందీ ప్రేమీ మండలి భవనానికి మునిసిపల్ ఏరియాలో స్థలము కేటాయించటానికి ప్రయత్నం చేస్తానని అన్నారు. నగర కార్పోరేటర్ గుడిపూడి రామకోటేశ్వరరావు M.A.L.L.B. అడ్వకేటు గారు తన ప్రసంగములో, ప్రేమీ మండలికి స్థలము విషయములో తప్పక ప్రయత్నం చేస్తానని మండలి కార్యదర్శి శ్రీ చింతల పూడి కుసుమ హరనాథ శర్మగారు తమ గురువు గారని చెపుతూ తన గురుభక్తి భావమును

చిన్నతనంలోనే హిందీలో డాక్టరేటు డిగ్రీ పొందిన చిరంజీవి పి. ప్రేమ్‌కుమార్ (హిందీ లెక్చరర్ హిందూ కళాశాల)కు, మండలి తరపున అభినందన చందనాలతో

సన్మానము జరిగినది. చిరంజీవి ప్రేమ్ కుమార్ కృతజ్ఞతలు తెలియచేస్తూ తన గురువు గారగు శ్రీ శర్మగారి ప్రేరేపణతోనే తాను ఉన్నత శిఖరమును అధిష్టించి తిననియు వారికి తాను ఋణపడి యున్నానని-నమ్రతతో తన గురు భక్తి భావమును

హిందీ ప్రచారరంగలో విశేష కృషి సల్పిన శ్రీ & శ్రీమతి డి.లింగేశ్వరరావు గార్కి ప్రచారక సన్మానము జరిగినది. తనకు జరిగిన సన్మానమునకు కృతజ్ఞతలు తెలియ చేస్తూ శ్రీ లింగేశ్వర రావుగారు ప్రేమీ మండలి అభివృద్ధికై నిరంతరము కృషి చేస్తూ, పట్టణములోని, జిల్లాలోని హిందీ ప్రచారకులలో ఐకమత్యమును సాధించి ఈ ఐక్యమత్యముతో మిక్కిలి సమర్థవంతముయిన కార్యక్రమము నిర్వహించుచున్న శ్రీ శర్మగారి కృషిని కొని యాడుతూ ఆశీర్వదించిరి. గుంటూరు పట్టణము నుండి సర్వ తృతీయులుగా వచ్చిన విద్యార్థుల బహుమతుల కొరకై శ్రీ లింగేశ్వర రావుగారు రు 116/- లు తమ విరాళము ప్రకటించిరి. ఈ ప్రచారక సన్మానము కీ.శే. శ్రీ కల సత్యనారాయణ మూర్తిగారి సంస్మరణతో వారి కుమారులు మరియు పట్టణములోని ప్రముఖులు జాతీయాభిమాని మండలి మాజీ కార్యదర్శి శ్రీ చన్నా వఝల లక్ష్మీనరసింహమూర్తిగారి ధాతృత్వముతో సుమారుగా 2500/-లు శాశ్వ నిధిగా మండలికి సమర్పించిరి. ప్రతి సం॥ పట్టణములోని ప్రముఖ హిందీ ప్రచారక సన్మానము చేయవలసినదిగా మండలి వారిని కోరిరి.

గుంటూరు పట్టణములో ప్రాధమిక నుండి ప్రవేశిక పరీక్షలలో సర్వ ప్రధములుగా వచ్చిన విద్యార్థులకు, హిందీ భోదన చేసిన హిందీ ప్రచారకులకు సన్మానము చేయుట ప్రేమ మండలి కార్యకలాపాలలో ప్రముఖ విశేషత. ప్రచారక సన్మానము మండలి ఉపాధ్యక్షులు శ్రీ చక్కా రామకృష్ణారావుగారి



*ది. 22-11-95 పట్టణ హిందీ ప్రేమీ మండలి, గుంటూరులో జరిగిన హిందీ ప్రమాణ పత్ర వితరణోత్సవము మండలి కార్యదర్శి, ఆంధ్రసభ కార్యవర్గ సభ్యులు మరియు శిక్షణ పరిషత్ సభ్యులు శ్రీ చింతలపూడి కుసుమహరనాథ శర్మ గారు తన రిపోర్టును సభకు సమర్పించునపుడు తీసిన ఛాయా చిత్రము*



*ది. 25-11-95న గుంటూరులో జరిగిన పట్టణ హిందీ ప్రేమీ మండలి వారి ఉత్సవములో పాల్గొనిన గుంటూరు పట్టణ నగర మేయర్ శ్రీమతి డాక్టరు కొల్లి శారదగార్కి సన్మానము చేయునపుడు తీసిన ఛాయా చిత్రము.*

దాతృత్వముతో ఈ సన్మానములు జరిగినవి. సర్వ శ్రీ ఏ.వి. రమణా రావుగారు శ్రీయన్. వి. సుబ్బారావు, కుమారి కె. మాలిని శ్రీమతి యం. వి. యస్. విజయలక్ష్మి గారు, శ్రీమతి కె. సత్యవతి గార్లకు సన్మానము జరిగినది. అట్లే గుంటూరు పట్టణములో సర్వ ప్రధములుగా వచ్చిన విద్యార్థులకు బహుమతులు యిచ్చుటకై మండలి ఉపాధ్యక్షులు శ్రీ వేము భావ నారాయణగారు శాశ్వతి నిధిగా రు.5000/-లు ఏర్పాటు చేసి తద్వారా బహుమతులు యిచ్చుచున్నారు. అట్లే సర్వ ద్వితీయులుగా వచ్చిన విద్యార్థులకు శ్రీ చక్కా రామకృష్ణా రావుగారి దాతృత్వములో బహుమతి ప్రధానము జరిగినది. బహుమతి ప్రధానము పాఠశాల ప్రధాన ఉపాధ్యాయులు శ్రీ బి.హెచ్. సత్యనారాయణ మూర్తి గారు బహుమతి ప్రధానం చేస్తూ "ప్రేమ మండలిలో ఈ రోజు జరిగిన కార్యక్రమమునకు ముగ్ధులయి" తన హర్షమను వెల్లడించిరి. ముందుగా మండలి కార్యదర్శి శ్రీ చింతల పూడి కుసుమ హరనాధశర్మ అతిధులకు స్వాగతము పలుకుచూ హిందీ ప్రేమా మండలి వారు నడుపబడుచున్న హిందీ మహ విద్యాలయ ప్రగతిని గూర్చి తన నివేదికను సభకు సమర్పిస్తూ, ప్రేమ మండలికి భవనము ఏర్పరచుకొనవలసిన ఆవశ్యకతను వెల్లడించిరి. తద్వారా యింకా అనేక కోర్సులు నడుపుటకు వీలగునని వక్కాణించిరి. ప్రేమా మండలి కార్య వర్గ సభ్యలు శ్రీ సి.హెచ్. హనుమంతరావుగారు వందన సమర్పణ చేసిరి. మండలి కార్యవర్గ నభ్యులు శ్రీ యన్. గిరిధరరావుగారు జాతీయగీతాలాపనతో సభ దిగ్విజయముగా ముగిసినది. ఈ సమావేశమునకు పట్టణములోని హిందీ ప్రచారకులు, భాషాభిమానులు, విధ్యార్థినీ విద్యార్థులు సందడితో సభ కనుల పండుగగా వున్నదని వచ్చిన పెద్దలు తమ సంతోషమును వెల్లడించిరి.

# హిందీ ప్రేమీమండలి, నిడదవోలు

ది 15-10-1995 సాయంత్రం గం॥4.00లకు హిందీ ప్రేమీమండలి; విశారాద విద్యాలయము తమ వార్షికోత్సవము, ప్రమాణపత్ర వితరణోత్సవము మరియు పండితుల సన్మానోత్సవము శ్రీసుంకవల్లి గణేశ్వరరావుగారు (మేనేజింగ్ డైరెక్టర్ పట్టిక ఫ్యాక్టరీ) వారి అధ్యక్షతన నిర్వహించబడినది. వేదపఠనము గావించబడినది. తదుపరి మండలి కార్యదర్శి శ్రీ. యన్.సి.హెచ్. సత్యనారాయణ శర్మ విద్యాలయ రిపోర్టును చదివి వినిపించిరి.

సభాధ్యక్షులు తమ కరకమలములతో ప్రమాణ పత్రములను పంచియిచ్చిరి. హిందీపైపు. పరీక్షలలో ఉత్తీర్ణులకు శ్రీమతి నండూరి సీతామహాలక్ష్మి (M.R.O.) బహుమతులు యిచ్చిరి. తదుపరి, చిరంజీవి యన్. హిరణ్మయి భరతనాట్యం చేసెను. ఈమెకు వి.వి.సత్యనారాయణ స్వామిగారు జ్ఞాపికను అందించిరి.

ఈ సభలో శ్రీమతి వి.రాజ్యలక్ష్మి (హిందీ పండితులు) శ్రీ గూడపాటి వెంకట్రావుగారు (హిందీపండిట్) మరియు శ్రీ మల్లాది నరసింహమూర్తిగారు (తెలుగుపండితులు) వీరందరికి శాలువలు కప్పి పండితసన్మానము చేసిరి. శ్రీమతి గుజ్జు నాగరత్నమ్మ (స్వాతంత్ర్య సమరయోధులు-తామ్రపత్రగ్రహీత); స్థలదాత - శ్రీ గ్రంధి కోటేశ్వరరావు గార్లకు శాలువలు కప్పి సన్మానించిరి.

సభకు విచ్చేసిన ముఖ్య అతిధులు, గ్రామపెద్దలు తమతమ ఉపన్యాసములలో హిందీ ప్రాధాన్యతను, ప్రమాణపత్రముల ఉపయోగమును విపులముగా విశదీకరించిరి. ఈ సభ రాత్రి 8గం॥లకు కార్యదర్శి శ్రీ. యన్.సి.హెచ్.సత్యనారాయణ శర్మ వందన సమర్పణ గావించగా, జాతీయగీతాలాపన తరువాత స్నేహపూరిత వాతావరణములో సభ ముగిసినది.

